# మీరా

బ్రహ్మశ్రీ నూకల సూర్యనారాయణమూర్తిగారు

మీరాబాయి సుప్రసిద్ధమగు మార్వారు దేశమున రాథోడ్ వంశజాతుడగు జయమల్లుని చేతులలో నల్లారుముద్దుగ పెరిగినబిడ్డ ఆదినుండియు పాండురంగని త్రికరణశుద్ధిగ సేవించిన భక్తురాలు ఆమెకు భక్తిలోగలయానక్తి రక్తిలో లేదు. ముక్తిపైగలవాంఛ మగనిపై లేదు. ఆలయములోని కరుగుటలోగల యావేశము ఆరామముల జూచుటలో లేదు. కుడుచునపుడు, నిద్రించునపుడు రంగని దివ్యనామ సంస్మరణమే. వంటయింటిలో భజన వాకిటిలో భజన పడకటింటిలో భజన తల్లిలేదు-తండ్రిలేదు-మగడులేదు. సర్వము ఆభక్తజన సులభుండగు పాండురంగడే! దుర్మార్గులగు ప్రజల దుశ్శీలయని దూరినపుడు వగవలేదు. జనాపవాదమునకు జడిసి తండ్రి విషమిచ్చినపుడు సలదనలేదు. విధవిరామములేని ఆడుపడుచు సాధించినపుడు కోపింపలేదు తిన కామేచ్ఛను దృష్టిపరుపమి భర్తయూవలకు సాగనంపినపుడు భయమందలేదు. ధైర్యచిత్తసుగుణవతి! సహనశీల! ఆ చంచల భక్తితో నానందమున మునిగితేలిన సాధ్వి. హిందూ సుందరీమణులలో దలమానికమైన యీ మీరాబాయి చరితము నేటికి నాటకరూపమున వెలువడు భాగ్యమాంధ్రలోకమునకు గలిగినది. హృద్యములగు పద్యములతో మోక్షసాధనమునకు బాటలనదగిన చక్కని పాటలతో అత్యద్భుత కథాసంవిధానముతో అసమాన కవితా ప్రసిద్ధతతో గ్రంధములలోనెల్ల అమూల్యరత్నమై, పద్యమై, నవరసభరితమై యొప్పుచున్న యీనాటకరాజమును జదువుచున్నప్పుడు పరమనాస్తికుడు భక్తుడుకాకపోడు. పాషాణహృదయుడు కన్నీరు గార్చకమానడు. ముక్కోపి, మూఢత్వము విడువక మానడు. సంకుచిత మనస్కుడు విశాలహృదయుడుగా మారకపోడు. భక్త్యుపాసకులకు అమూల్య కంఠమాల.

వెల 1—0—0

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,
ప్రింటర్సు, పబ్లిషర్సు, అండు బుక్సెల్లర్సు. రాజమండ్రి.

# రౌడీ

(సాంఘిక నాటకము.)



కర్త:

భావకవి జి. గోపాల్ గారు



కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,

ప్రింటర్సు, పబ్లిషర్సు, అండు బుక్సెల్లర్సు, రాజమండ్రి.

1945

'శ్రీ రాజేశ్వరీ ప్రెస్' రెండవ ముద్రణ.

# ప్రకటన.

—:o:—

యీ నాటకము తొలికూర్పు వై. బాబురావు 'రాయలసీమ రాణీ' యని ప్రకటించెను. తరువాత యీ నాటకపు హక్కును మాకమ్మినారు. నాటకమంతా చదవగా రాయలసీమ అనుపదం మా కనవసరముగాను రాయలసీమకు యీ రాణీని ఆపాదించుట మాకు నచ్చక ఆ పదముతీసి 'రాణీ' యని మాత్రముంచి ప్రకటించితిమి సర్వహక్కులను మాకు జెందియున్నవి గాన ముద్రింపించుట, ప్రదర్శించుట, స్క్రీన్ జేయుట, రికార్డు నిచ్చుట వగైరా మా యనుమతి లేనిదే నెవ్వరు చేయరాదు జేసిన మా నష్టమునకు బాధ్యులగుదురు

ఇట్లు కాపీరైటు హక్కుదార్లు,
కే. తమ్మారావు అండు సన్సు,
రాజమండ్రి.

 వెల 1—4—0.

# కథాసంగ్రహము.



దామోదరుడను యువకుడు గొప్పకులమున జన్మించినవాడు. ఇతడు బొంబాయి కాలేజీయందు బి. ఏ. చదువుచు నొకదినమున టెన్నీసు పందెమున రెండువేల రూప్యములు పోగొట్టుకొని తనకు విద్యపై యిష్టము లేదని కాలేజీ విద్యార్థుల కెఱింగించి తన నివాసస్థలమయిన నెల్లూరునకు వచ్చెను. కాని యతని జననీ జనకులు యతని నభిమతమునకు సమ్మతింపకుండుటచే మరల బొంబాయికి వచ్చెను.

అచట విద్యను మాని రౌడీగా తిరుగుచు మూర్తిసింగుభార్యయగు మీనాక్షిని ప్రేమించుట. ఒక దినమున దామోదరుడు మీనాక్షి గృహమున నామె పెనిమిటి లేనివేళ నిర్భీతిగా ప్రవేశించుట. ప్రవేశించి ప్రియురాలయిన మీనాక్షితో సంభాషించుచుండగా మూర్తిసింగు గృహమున ప్రవేశించి దామోదరుని దూషించుట. అప్పు డతికోపముచే మూర్తిసింగును దామోదరుడు పిస్తోలుతో కాల్చివేసి, ప్రియురాలితో కర్నూలు చేరుట.

అచట కొలదిదినములు వారుండిన పిదప దుర్గారావను స్నేహితుడొక బళ్ళారి బాలికయయిన లలితయొక్క చిత్రపటమును దామోదరునికి చూపించుట. అంతట దామోదరుడా లలనామణిని పరిణయమాడ నిశ్చయించెను. కాని యీ సంగతి దుర్గారావునకు తెలుపకుండెను. దుర్గారావు నీతిపరుడయినందున తన మనోయిష్టము లలితను వివాహమాడెదనని జెప్పి నిష్క్రమించెను.

అంతట దామోదరుడా కాంతాశిరోమణిపై ప్రేమ యత్యధికమై యుండుటచే మీనాక్షిపై భ్రాంతి లేకుండెను. ఆమె కడుప్రశాంతముగా దామోదరుని ప్రశ్నించెను. కాని యతడు లలితను వివాహ

మాడెదనని జెప్పి పయనమగుటకు సంసిద్ధుడాయెను. అంతట మీనాక్షి శోకమును భరింపలేక తనకట్టి చెప్పత్రోవ కలిగినందులకు దామోదరుని దూషించెను. అప్పు డతడు మారుపలుకక నీ ప్రేమవలదని జెప్పి బళ్ళారికి ప్రయాణమాయెను.

అనంతరమా యువతి తనకట్టి దుఃఖము కలిగెనని ఆత్మహత్యకై ప్రయత్నింప కౌశికుడను యోగివలన ఈమె ధన్యతగాంచుట బళ్లారి యందు లలిత జననీజనకు లామెను దుర్గారావునకిచ్చి వివాహ మొనర్ప ప్రయత్నించిరి. కాని ఆమె దాని నమ్మతింపక దామోదరుని చేపట్టె దనని జెప్పుట. అంతట వారొక ముహూర్తమున నామెను బంధించి దుర్గారావునకు కళ్యాణముచేయ సంసిద్ధులై యుండువేళ దామోదరు డట ప్రవేశించి తన పిస్తోలుచే వారిని బెదరించి లలితను జేకొని నిష్క్రమించుట. జననీ జనకులా పరితాపమును భరింపలేక కౌశికాశ్ర మమందు దైవభజనకై నిష్క్రమించుట.

దామోదరుడా సతీతిలకమునుగూడి తనకుగల మధుసేవాదుర భ్యాసమును దినదినమునకు హెచ్చించుచుండి తా నొకనాడు లలిత యొక్క యాభరణములను గైకొని విక్రయించి క్రయధనమును రాజ లక్ష్మియను వేశ్య కొసంగుట అంతట లలిత నగలుపోయెనని దుఃఖించి దామోదరుని దూలనాడుట వారిరువురు కలహించుకొని ప్రేమవల దని జెప్పి దామోదరుడు వేశ్యగృహమున కరుగుట. వేశ్యయగు రాజ లక్ష్మి యాతనిని మరికొంతధనమునకై ప్రార్థింప, దామోదరుడు తన చెంత ధనము లేదనుట అంతట వేశ్య తన యింటనుండి వెడలిపొమ్మని ప్రియునకు విన్నవించుట అతడా ప్రేమను భరింపలేక వేశ్య సద్గు ణాశయముల వక్కాణించి నామెను తిన్నగా వారిరువురు వివాదపడుట.

దామోదరుడిచెంత ద్రవ్యము లేనందుచే యాతనికి మతి తెలియక తనచెంతనుండు పిస్టోలుతో ధనికుడైన పేరిశెట్టికి తాకట్టుపెట్టబోవుట. అంతట యతడు దానియెడ సందేహించి యత నిని నగౌరవించుట. దామోదరుడా కోపమును సహింపలేక రాత్రి పండ్రెండుగంటలకు పేరిశెట్టి గృహమునకు దొంగతనమునకై వెళ్ళి వారిచేచిక్కుట అప్పుడు దామోదరుడాలసించిన ప్రమాదము వచ్చు నని తలంచి పేరిశెట్టిని పిస్టోలుతో కాల్చివేయుట. పోలీసులు విచారిం పగా సేవకుడు చంపెనని దామోదరుడు జెప్పెను. కాని వారందరు న్యాయస్థానమునకు గొంపోవబడిరి.

న్యాయాధికారి న్యాయములం బరిశీలించి శిక్ష విధించుటకు సాక్ష్యమేమియు లేదని చింతించు వేళ లలిత తన కక్ష తీర్చుకొనుటకై న్యాయస్థలమున ప్రవేశించి దామోదరుడైన రౌడీ చర్యలు ప్రకా శించి పేరిశెట్టిని యతడే చంపెనని జెప్పుట. అంతట న్యాయాధిపతి దామోదరునికి మరణశిక్ష విధింప నాతడు తన రౌడీచర్యలదలంచి కడు పాపమని భక్తవత్సలుని ప్రార్థించి, తలిదండ్రుల గొనియాడి, భారత దేశీయులకు వందనమిడి, రాజశిక్ష వహించుట!

సమాప్తము.



# ఇందలి పాత్రలు.

—♦ పురుషులు ♦—

1. దామోదరుడు—రౌడీ కథానాయకుడు.
2. రాజరత్నం—రౌడీ స్నేహితుడు.
3. ప్రసాదరావు—కాలేజీ విద్యార్థి.
4. బాలాజీ—టెన్నిసు ప్లేయరు
5. రిఫరీ.
6. జయంతుడు—రౌడీ తండ్రి.
7. మూర్తిసింగు—బొంబాయిలో ధనికుడు.
8. బాలకుడు.
9. మోహనరావు—విద్యార్థి.
10. విద్యార్థుడు.
11. దుర్గారావు—రౌడీ పూర్వస్నేహితుడు.
12. కౌశికుడు—యోగి
13. సుగంధుడు—లలిత తండ్రి.
14. పేరిశెట్టి—ఎర్రకుడు.
15. న్యాయాధిపతి
16. ప్లీడరు.

—♦ స్త్రీలు ♦—

1. సుశీల—రౌడీ తల్లి.
2. మీనాక్షి—మూర్తిసింగు భార్య.
3. లలిత—కథానాయకురాలు.
4. పుష్పవతి—సుగంధుని తల్లి.
5. రాజలక్ష్మి—వేశ్య.
6. లక్ష్మి—దాసి.
7. పేరిశెట్టిభార్య.

ఇంకను సమయానుకూలముగా సేవకులు, పోలీసులు వత్తురు.



# రాత్రి

## ప్రథమాంకము.

---

### ప్రథమ రంగము.

(బొంబాయి నగరము—కాలేజీప్రాంతమున దామోదరుడు)

దామో:— ఈ యాంగ్లవిద్యాభ్యాసమున గడతేరి యీ కాలమందు నుద్యోగము సంపాదించుట అతిదుర్లభము. నా మాతాపితృలెంత జెప్పినను నా యభిప్రాయములకు సుంతేని యంగీకరింపకున్నారు

సీ. బియ్యేను పాసైన భిక్షమెత్తుటె కాని
సుంతైన లాభంబు జూడబోము
సూట్లు బూట్లు మెండు మాడ వేయుటె కాని
సుంతైన లాభంబు జూడబోము
పర్యాయము అయిల్సు పరగ దాల్చుటె కాని
సుంతైన లాభంబు జూడబోము
మోటారు సైకిళ్ళ బోవుచుండుటె కాని
సుంతైన లాభంబు జూడబోము

గీ. అరయు డీలాంటి పోకుల కరయుచుండు
విద్యయే కారణంబని విమలమైన
హృదయమందలి జనియించు హెచ్చుగల్గి
పొగరుగూర్చిన వీరిది పుణ్యమేమొ.

మరియు విద్యాప్రవీణుల న్యాయాన్యాయముల స్మరింపనిష్క-
ళంకమయిన యీ భరతమాతకు సుఖ సంప్రాప్తమేయని, దలంప
నసందియము.

గీ. దేశవిద్యలమాని వినాశమైన
యన్యవిద్యల జేకొన హర్షముగనె
తలి చనుబాలు పోద్రోచి దాల్మి మీర
నన్యపాలను గ్రోల మీరరుగగలరె.

ఏదియెట్లయినను యీ విద్యపై నాకిష్టమే జనింపదు. ఇష్టాను
కూలమున ప్రవర్తింతమన్న పరీక్షయందలి తప్పుదు కేమోయని భయ
మగుచుండెను. ఏదియెట్లయినను, ఈ టెన్నిస్ మేచ్ జరిగిన వెంటనే
యూరికి ప్రయాణము చేతును. ఈపందెము కడు పౌరుషమున జరుగు
టచే, నాకతిభయ మొదవుచున్నది. కానిమ్ము. జయాపజయములు
దైవాధీనములు

గీ. జయము నపజయమింతైన స్మరణజేయ
ధరను యోగీంద్రునకునైన దనివిలేక
వగపు జెందుటె యదివట్టి భ్రాంతిగాదె
విధిలిఖించిన వ్రాతకు వేరుగలదె

ఇక నా పందెముగురించి విచారింప నిష్ప్రయోజనము. నా
శక్తి సాహసములే నా ప్రధానమిత్రులు.

రాజరత్నం :—(ప్రవేశించి) దామోదర్! ఏమి మీ చింత.

గీ. చిన్నబోయెను మొగము నీకొన్నవంత
యెట్టుగలెనో దెల్పు నాకెరుక లేదు
నంతగుందంగ హృదయాన ఫలముగలదె
కాలమేరీతి గల్గునో కల్గుగాదె

దా :—మిత్రమా! నుదుట వ్రాసిన వ్రాతకు వేరుగలదా?
అయినను...

రాజ:—మిత్రమా! ఎందులకు మీరిట్లు భయపడుచున్నారు? నీ స్నేహసంబంధమున నీకాకపజయము కలుగుననియా?

దామో:—కాదు కాదు. మనస్నేహమిక చెడునను భయము నాకు కల్పించి యుండుటచే నే నిట్లుండవలసియున్నది.

రాజ:—మిత్రమా దామోదర్!

సీ. కాలేజి జేర నన్నాంచిరమ్మనునట్టి
స్నేహంబదెట్టుల జెడగనుండు
మిత్రమారమ్మంచు మిగులనాహ్లాదించు
స్నేహంబదెట్టుల జెడగనుండు
నొకచోటభుజియించి యొకచోటబరుండెడి
స్నేహంబదెట్టుల జెడగనుండు
నొకరునొచ్చినవెంట నోదార్చిదయజల్లు
స్నేహంబదెట్టుల జెడగనుండు

గీ. వేకదుస్తులధరియించి పాకటమున
నన్నదమ్ముల్రీతి నాహ్లాదమెలగ
కార్యసాఫల్యమును జేయు గాంచునట్టి
స్నేహమే లిజెడును సంస్క్రమలర.

మిత్రమా! యెన్నడు లేని విచిత్రపల్కులు బల్కుచుంటి వేమి? కారణము!

దా:—కారణమా! ఈయూంగ్లవిక్టపై నాకిష్టము లేదు. అనన ఎత్ నిట్టి సందేశమున నాహృదయమంతయు దహించుచున్నది. ఏది యెట్లయినను ఈటమ్నిన్ మేచ్ జరిగినవెంటనే యూరికి ప్రమాణ మొనర్చి నాయీ సందేశము మా జననీజనకుల కెరింగింతును.

రాజ:—మిత్రమా! సువిద్యపై నీ కత్యభిలాష కలిగియుండె నే. దానిని విడనాడి నీ వేమిజేయ నిశ్చయించితివి? ఇయ్యది నీ కన్య బోధనవలన సంప్రాప్తించినదని తలంచెదను.

దామో:—మిత్రమా! పొరబడితివి.

గీ. సహజపుణ్యానగల్గిన వాంఛయుదియు
విద్యయందలి పేరొంద వెలయునంచు
దలచినాడవు యదిరిత్త కలుషమతులు
బ్రిబలుచున్నారు యుర్వీతా బ్రితుకపలచి.

ఇతరబోధకు నే నంగీకరింతునా? త్రికరణశుద్ధిగా ఈ విద్యాభ్యాసమునకు నే నంగీకరింపను. మిత్రమా! ఈవర్తమానము మరె వ్వరికయిన దెలియకూడదు సుమా. అదిగో! ప్రసాదరావుగారు వచ్చుచున్నారు.

రాజ:—దామోదర్! ప్రసాదరావు మనకు వైరివర్గమున చేరినవాడు. గావున, నాతనితో మితిమీరి సంభాషింపకుము.

(ప్రవేశము—ప్రసాదరావు)

ప్రసా:—మిత్రులారా! ఏదియో మీరు కర్తవ్యమునకు యోచించు చున్నట్లున్నారే? టెన్నిస్ మేచ్ విషయమేనా?

దామో:— ఆపందెమునుగురించి విచారించుట కది మోసమై యుండుననియా? ఏతలంపున మీ రిట్లు ప్రశ్నించుచున్నారు. రాజరత్నము నా ప్రియస్నేహితుడని మీకు తెలియునుగదా! మీ ప్రశ్నకు నేనెంతయో పశ్చాత్తాపించుచున్నాను.

ప్రసా:—పశ్చాత్తాపమా! అడిగినంతనే మీరిట్లు సందేహించుట బాడియా? రాజరత్నమునకు సరిగా నేనును తమ మిత్రుడనేగదా?

దా:—ప్రసాదరావూ!

సీ. కలసితిరుగాఢ స్నేహంబు గాంచితంచు
శ్లాఘనందున జదివితి కాననీకు
సఖ్యభావంబు గలదంచు సంస్మరింప
ఫలము లేదయ్యె యిదియట్టి భ్రాంతినిజము.

రాజరత్నమునకు సరిగా నీవు మిత్రుడవే కాని, యతనికి గల గుణంబులు నీచెంత లేవు.

ప్రసా:—ఏమి ? నీకే మపకార మొనర్చితిని. ఊరక ప్రయత్నించక యెందులకు మీకీ కోపము ?

రాజ:—క్రోపమునకుమించు తాపముకూడ గలదు. దానిని యోచించి స్మరింపుము.

దామో:—ప్రసాదరావూ ! ముందు నా కన్నియో నీవు మర్మతముల బోధించితివి. కాని యవి నాకనుకరింపకుండినవి. తుదకు నాకేమి యపకార మొనరించితివో స్మరింపుము. అద్దానిని మరతు మన్నను మరపు రాకున్నది.

ప్రసా:—మిత్రులారా ! మీ రెందులకింత కోపము లెన్నిన్ మేచ్ కుపోవు వేళగనుక వినోదము చూడ మీచెంతకు వచ్చితిని. మీకింత కోపమయిన నా కెందుకీ భ్రాంతి. పోయివత్తును.

(అని పోవును.)

(తెర వ్రాలును.)

---

2 వ రంగము.

(ప్రవేశము—ప్రసాదరావు)

ప్ర:—ఔరా ! కాలమహిమ దారిపోవు కలహాములు పిలిచి నట్లయ్యెనే ! దురాత్ముడు. దామోదరుడు నన్నెట్లు తిరస్కరించెను ? ఎప్పుడో నేనొనర్చిన యుపకారమునకు తానొచ్చినడట. ధనికుడగుటచే నాతనికింత గర్వము. ఔరా! దురాత్మా ! నీవురాజరత్నము హితోప

దేశమున నన్నింత యవమానించితివి. ఈ ఫలితము నేను మరచునని తలంపకుసుమా! నీవు టెన్నిసుకు కట్టినపందెము రెండువేల రూప్యములు పోయినవని తలంపుము. ముందు జరుగబోవు కాలవైపరీత్యముల యోచింపుము మిత్రమా!

సీ. చేయరానట్టి కృత్యములు జేయుదేను
చెప్పరానట్టి బడుగుల జెట్టజేతు
సాహసంబెన ప్రాణంబు సంహరింతు
నెవరు నడ్డమువత్తురో నెందుజూతు.

అదిగో! దామోదరుని యన్నపార్టీ బాలాజీ వచ్చుచున్నాడు. అతనితో నా యవమానమును విన్నవింతును.

(టెన్నిసుబేటు చేతబూని బాలాజీ ప్రవేశము)

బాలాజీ:—(తనలో) కోర్టుకుబోవు వేళ మించిపోయినది. త్వరగా బోవకున్న పందెము నిష్ప్రయోజనమగును (అని తొందరగా బోవుచుండును.)

ప్రసా:—మిత్రమా బాలాజీ! దామోదరుని దుండగము గమనించితివా? నిష్కారణముగా నన్ను నిందించెను.

బాలా:—నిందించు టెందులకు? అతని క్రూరత్వము నీవు గమనించియుండియు నాతనిచెంత కేలబోతివి? అయినను కానిమ్ము సమయమునకై వేచియుందును.

ప్రసా:—మిత్రమా! పందెమున నీ వాతని జయింపవలెను సుమా కడు జాగరూకుడవై యుండుము.

బాలా:—అయ్యో! యోచించి మాట్లాడుట కించు కాలము లేదు. రమ్ము టెన్నిసుకోర్టునకు వెళ్ళుదము. (అని నిష్క్రమింతురు.)

తెరపడును.

3వ రంగము

(జెట్టిపట్లోర్లు—రిఫరీ మున్నగువారుందురు)

రిఫరీ :—సర్దార్! ఇక పోట ప్రారంభింపుడు.

(పోట ప్రారంభింతురు)

రిఫరీ :—పెట్టినపందెము బాలాజీగారు గెలిచిరి దామోదరుడు ఓడిపోయెను బాలాజీ! ఇదిగో రెండువేల రూప్యములు చేకొనుము.

బాలాజీ :—(డబ్బు తీసుకొని) దైవకృపావశమున నేను ధన్యుడనయితిని. మిత్రులారా! ఇంటికి ప్రయాణమౌతము.

(అందరు పోవుదురు)

(దామోదరు—రాజరత్నం నిలచియుందురు.)

దామో :—దుర్భరము. అవమానమును భరింపజాల. పందెమునందు రెండువేలరూప్యములు పోవుటయేగాక నా బంధుమిత్రుల యెదుట నేనెంత యవమానింపబడితినో ఇక నీ జన్మమున్న నేమి ఇంతలో నశించిననేమి? రక్షకా! నన్నెంత దుఃఖసాగరమున తపింపజేసితివి?

గీ. ఆర్తరక్షణ మనుకొని యంకితంబు
వలన ఫలమేమి భక్తుల పాలవాడ
వంచు బొగడిన ఫలమేమి యుంచు కేని
ఫలముగలుగదు నా జన్మ కలుషమేమొ.

రాజ :—మిత్రమా! నీ యపజయమునకై చింతింపకుము దైన్య మవలంభించి మరల పందెమునకు ప్రయత్నింతము సమయానుకూలమున నేనుగుసయితము పాదరిండ్లచే బంధింపబడునుకదా! దానికయి చింతింపనేల ఇటువినుము.

సీ. బుస్సుబుస్సని లేచు భూరిసర్పంబులు
చలిచీమలచేజిక్కి చావలేదె

పరమభీకరమైన వ్యాఘ్రముంబు లోకవేళ
మృతికొంచలేదొకో వితతిచేత
ఘీయనునాదంబు చేయుచుండెడిహస్తి
పొదరింపలోఁజిక్కి పదరలేదె
సర్వజీవులశిక్ష సలిపెడి కాలుండు
పతివ్రతామణులచే బడెడిబాధ

గీ. వారు వీరననేల నీ వసుధయందు
జిక్కడే భక్తమంత్రంబు జేసివుండు
కాన యీ జగమహిమంబు గానగలరె
దాననిధులైన దైవజ్ఞులైన కాని.

మిత్రమా! నీ వట్లధయిర్యపడకుము.

దా:—ఔరా! మానవజన్మ మెట్టిదుఃఖప్రాప్తమై యున్నది. చేతినుండు రెండువేల రూప్యములు బూడిదలో బోసిన నెయ్యవలె నిష్ప్రయోజనమయ్యెను. రూప్యములు పోవుటేగాక కాలేజీవిద్యార్థులయెడ నేనెంత యవమానింపబడితిని? మిత్రమా! నా నిజనివాసస్థలమగు నెల్లూరునకు పోవుచున్నాను.

జ:— దామోదర్! ఇట్టి పిరికివార లెందయిననగలరా? విద్యను చాలించి నెల్లూరునకు ప్రయాణమైనట్లువా? శెలవులయందుబోకూడదా?

దా:—గాదు. ఇక నిలచుటకు కాదు. తప్పక పోవలయును.

జ:—పోయిన మరెప్పుడు వత్తువు?

దా:—నమ్ముటమాట కల్ల.

జ:—అట్లయిన విద్యను చాలింతువా?

దా:—సందియము లేదు మిత్రమా! ఏడుగంటలు కావచ్చెను: ఆలసించిన బండి తప్పిపోవును పోయివత్తును.

రాజ:—పోవుచున్న మిమ్మాటంకపరచుట నాకు పాడిగాదు అప్పుడప్పుడు శుభ లేఖల వ్రాయుచుండుము.

దా:—మంచిది.

(నిష్క్రమించును.)

[తెర పడును.]

ప్రథమాంకము సమాప్తము.





# రాత్రి

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

క్లాపునందు దామోదరుని మందిరము.

(ప్రవేశము—సుశీలా జయంతులు.)

సుశీ:—నాథా! పుత్రుడు దామోదరుడు చదువుపై యిష్టము లేదని యనేక కబురులంపుచున్నాడు. ప్రయత్నమేమి చేయవలెను?

జయం:—కాంతా! వాని పిచ్చితలంపులకు నీ వంగీకరింతువా? అట్లు కాదేని వాని యిష్టమువచ్చినట్లు మానుకొనుమని చెప్పుము. వానితోని ఎన్నటికిని మాటలాడను.

సుశీ:—నాథా! ఇదేమి పెంకిపట్టు? లేక లేక గలిగిన పుత్రునిపై నింత యసూయజనించెనా? చదువువలదని చెప్పు ముద్దుకుమారుని తిరిగి హితోపదేశమున సంతోషపుచ్చవలయునే గాని మీకిట్టి పంతము చెల్లునా? మీ రీ మొండి దయతో లాగిన దామోదరుని బ్రతుకిక వ్యర్థమే కదా! నాథా! అట్లొనర్చుట మీకు ధర్మమా? కుమారుని కనికరింపుము

జయం—ఎన్నివిధముల కనికరింతును? ఎంతద్రవ్యము పాడు చేతును? మొన్న మాసమునకు క్రిందట మూడువేల రూప్యములు బంపితినే దానికైన సమ్మతింపవా? ఇక నాకీ గొడవ యెందులకు? నీ యిష్టమైనట్లు చేసుకొనుము (అని కోపమున లోనికి బోవును.)

సుశీ :—(నాధుని పోవుచుండ) నాథా! ఇంతకోపమా? అట్లు యిన దామోదరుడిక దారి దప్పెనా? విద్య నేర్పించినను సంపూర్ణము గాకపోయెనే అక్కటా! బాలున కెందులకు విద్య నేర్పించుట? ఇట్టి దిప్పలనపడనే కదా నాకు దుఃఖము కలుగుట (అని దుఃఖించును.)

దామోదరుడు ప్రవేశము.

దామో :—తల్లీ! నీ వేల దుఃఖించుచున్నావు? తండ్రిగా రేమైన నిన్ను దూషించెనా?

సుశీ :—కుమారా! ఎప్పుడు వచ్చితివి. నా దుఃఖమునకు నీవే గదా కారణము.

దా :—నీ దుఃఖమునకు నేను కారణమా? తల్లీ! ఎందులకు.

సుశీ :—ఎందుకా? నీకు విద్యయందు ఇష్టము లేనందుకు.

దా :—అమ్మా! నీ కాళ్ళకు మ్రొక్కెదనుగాని యీ విద్య వలదు. నేను కష్టములు భరింపజాల. ఇక విద్యాభ్యాసవృత్తి దుర్లభము

సుశీ :—దుర్లభమైన నీ యదృష్టమును పరిశీలించుకొనుము. నీ తండ్రి యిక నీతో మాట్లాడనని చెప్పినారు.

జయుం :—(ప్రవేశించి) ఏమిరా! మరల యెందులకు వచ్చి నావు. విద్యపై నీ కిష్టము లేదా?

దా :—తండ్రీ! త్రికరణశుద్ధిగా నా కిష్టము లేదు.

జయుం :—అట్లయిన నా యింటనుండి గెంటించెదను. పోదువా తక్షణము బొంబాయికి పొమ్ము లేకున్న నాయింటనుండి వెడలిపొమ్ము

దా :—తండ్రీ! నీకు ఇంత కోపమెందులకు? బిడ్డ డెంతదుష్టు డైనను జనకుడనకు లేకదా సహింపవలయును.

జయుం :— ఎంతకాలమని సహింతును. నీ ప్రయాణ మింక కొనసాగింపుము. (అని లోనికి బోవును.)

సుశీ :—కుమారా ! ఇక నీ పట్టు వదలుము. బాగ బాలుకి పొమ్ము కడు శ్రద్ధగా విద్య నభ్యసింపుము.

/ కం. విద్యయే కార్యగౌరవ
విద్యయె సర్వాధికార పేరోచ్చలితల్
విద్యయె మాన్యుల ప్రాణము
విద్యది లేకున్న గలదె పృధివి యశస్సు.

నాయనా ! విద్యయే సర్వ కార్యములకు ప్రధానము. ఇదిగో ! డబ్బు గైకొనుము.

దా :(డబ్బుతీసుకొని) తల్లీ ! మాతండ్రికి నాపై యింత కోప మేలకు ? నా యీ విద్యయే కదా కారణము ఇక నేను పోయి వత్తును తండ్రికి నాపై యింత యసూయ లేకుండునట్లు జేయుము.

సుశీ :—కుమారా ! అయ్యది నాభారము లెమ్ము. బిడ్డలకాను నీవు ప్యానయిన ఇంగ్లాండునకు పంపవలయునని మీ తండ్రిగారెన్న సారులో జెప్పినారు.

దా :—అమ్మా ! మంచిది. ఇక పోయి వత్తును. తండ్రిగారి నేటోవు వార్తను వక్కాణింపుము. (అని నిష్క్రమించును.)

(తెరపడును)

---

## 2 వ రంగము.

### (ప్రసాదరావు - ప్రవేశము.)

ప్రసా :—మరాత్మా దామోదరా ! నీప్రసంగములు ముగిసినవి కదా ! న్యాయాన్యాయముల చర్చించక నిష్కారణముగ నన్ను మూలనాడితివి. ప్రతిఫలము గ్రహించితివిక కదా ! పందెమునందు రెండు వేలురూప్యముల గోల్పోయితివి. ఇకముందు జరుగు కార్యమున ఏవతి

జాగరూకుడవై యుండుముసుమా! ఆనాడు కోపసంజనిత హృదయుండవై బల్కిన శపథముల మరువకుము. అవి యెల్లను సత్యవాక్యములని తలంపుము. ఏరా! ధనికుడనని గర్వింపకుము త్వరలో నీకు గర్వశాంతి కాగలదు.

ఔరా! రాజరత్నమంత మత్రియ స్నేహితుడా? అతనియెడ దుర్మతముల నీవెరుంగలేక నశించుచున్నావు. తదకు నీవెట్టివేషమున ప్రవేశింతువో యాలోచింపుము. తనువు సర్వదా స్థిరమని తలంపకుము ధనమునుజూచి గర్వింపకుము. రేపో లేక నేడో మాన్యునకె ప్రాభము గూలుట నిశ్చయము.

— గీ. ధనధనేతరమందిన ధనికులెల్ల
మృత్యువెంట నిడిననని మిగులుగాదె
జీవములు గోలుపోవుము దేవుడుందు
భజనసల్పిన ఫలమందు బడయగలవె.

సర్వజీవరక్షా దక్షుండగుయిన కాలునిచే నే జెట్టిబాధల గ్రహింతువో నాకు తెలియును. సర్వవేత్తలకు తెలియును పాషాణహృదయా ఆగుము. ప్రపంచమున నిన్నుమించు ప్రవీణులిక లేరా? మదాంధా! గర్వింపకుము. ఔను నాకిప్పుడు మంచి పదుపాయము దొరికినది దామోదరుడు పందెమునందు రెండువేలరూప్యములి గోల్పోయెను గదా! అయ్యావి తన జననీ జనకు లెరుంగకుందురు. ఇప్పుడు యితని యెడ తండ్రి ననూయజూజినట్లు నేనొక లేఖ దామోదరునకు తన తండ్రి వ్రాసిన విధమున నే వ్రాయుదును అప్పుడితను తండ్రిపై కోపము గలిగి యేదియో మాయోపాయము నొనర్చును. ఇదంతయు పరిశీలించి కక్ష నెడబాపుకోవలెను.

(అని యొక లేఖను వ్రాసి) దీనిని నెల్లూరు ప్రయాణీకుల కిచ్చి యా పూరు పోస్టునందు పడవవేయుమని జెప్పెను. ఇందాలసించిన

ప్రయోజనము లేదు. (అని పేకను తీసుకొనిపోవును.)

[తెర వ్రాలును.]

## 3 వ రంగము.

[సాయంసమయమున మూర్తిసింగు, మీనాక్షి యొక కాంతారమున]

మూర్తి :— బాలా! కోమలమైన పుష్పగుచ్ఛము నీక్షింపుము.

సీ. గగనాంతరంబున గాంతియగా లేజాజి
వన్నెమించెడి జాజి సన్నలవి యె
ఫలభారమునసుంత వాయువీచినయంత
ఘల్లు ఘల్లునరాలు సౌఖ్యఫలము
యింతవిన్నను గాని మంతనంబందని
తనివితీరని కేర ఘనత పలుకు
తామరంబునమెక్కి తైతక్కలాడు యా
హంసాళి గోరెన హర్షమిచట

గీ. మీర లేకుండ లోవ మయూరసొంపు
కలసి పచ్చిక మేయు వికాంతితతిని
నాటలాడించు కోయిల పాటలందు
బ్రిబలుచున్నవి కాంచుమా వనరుహాక్షి.

కాంతా!

గీ ఇట్టి యుద్యానమున మన మెట్టులైన
గాంచినారము యస్తోకకరముమీర
నదిగో కాపుడు పచ్చిక నండ జేరె
స్వాతమంను ముద్దాడిన సొబగుగాదే.

బాలా! నీవేల సందేహించుచున్నట్లున్నది. సౌఖ్యానందమున నోల

లాడుట కిదిసమయముగాదనియా? అట్లు స్మరింపకుము ఇట్టి నిరశా రణ్యప్రదేశమున మనకెట్టి యాటంకమయినగలదా?

మీరా :— నాథా! భర్త సాంగత్యమునకు సందియమెందుకు? వనవినోదముగాంచ నా మనస్సు చలించుచున్నది. అదిగో! అటు చూడుడు.

గీ. అంకపీఠే ముందుబండిన మూంసతతుల
భర్త మీా ముందడుగుచు తాభార్యనరసి
సౌఖ్యమిన దేలరమ్మనుచు జనగలేదె
చెలియ పెనిమిటి మెడల సిగ్గుగలదె.

సర్వలోకోక్తుల గ్రహించిన మీాకు జెప్పనలసిన దేమున్నది? సర్వదా సతీపురుష దాంపత్యములు నుత్సాహము లేకదా!

మూర్తి :— ప్రియుడ! మోదసంవళితహృదయురాలవైన నీ హృదయమున కెంత మోసంతసించితివి రమ్ము మన యిష్టానుసారము ప్రవర్తింతము. (అవి యొకచో గూర్చుండుదురు.)

[దామోదరుడు—ప్రవేశము.]

దామో :— ఓరా! ఈ యుద్యానవనన మెంతశృంగారమై యున్నది. సుమా రిప్పుడు రాత్రి యెనిమిదిగంటలు కావచ్చును. నిండు పౌర్ణమి రాత్రియగుట చే వనంబెంత యాహ్లాదకరమైయున్నది.

గీ. గగన భాగంబు నందుండి గాంతినొల్పు
చంద్రుడల్లదేమోదావ నెగడెదాన
పక్షిజాలంబు లందలి పైకిపాకి
కిలకిలధ్వను లానందమున ధరించె.

ఓరా! వసంతరాజకల్లల విభ్రాజితమయిన యీా వనరాజ మునకు సాటియేది? ఇట్టి వనాంతగమున సంచరించు సతీపురుషులకుత్సా హంబు లత్యానందంబు లేకదా! (ముందునకు చూడ మూర్తిసింగు

భార్య లేచియుండుట గాంచి) యెవ్వరా సతీపురుషులు ! ఇంత రాత్రి కాలమున వినోదమునకై వారిచటికే తెంచిరా ? ఔరా ! ఏమి వారి భాగ్యము అందు జరి చు కాంతాశిరోమణి యవ్వన మత్యంతశృంగారమైయున్నది. నవలాంతి విభూషణమైన యీ సుకుమారి మానవకన్యయాయని సందేహము గుచున్నది.

సీ. నిండువెన్నెలరేయి నెరసించు నెమ్మోము

దరయ మోహాంకంబు మెరయు గాదె

కొండవంచునుమించు తోయ్యలియధరంబు

ముద్దాడ మోహంబు దిద్దు గాదె

అద్దముతో బోల్చు యతివ చెక్కిలి కెంతో

మోహవైరాగ్యముల్ తెరవుగాదె

హంసనడకమించు యతివ నాలింగంబు

దేవేంద్రభోగంబు దెచ్చుగాదె

గీ. కలికి లేసారు భాగ్యంబు గాంచునట్టి

మనుజజన్మంబు ధన్యంబు వనిత యిదియె

మారుని గజ్జెలగుర్రంబు కరణినార

నడచి ముందుకు కుచున్నది లతాంగీ.

ఇట్టి నాకేందు తేజోన భాసవంతురాలై యున్నదాని రమించిన నిక స్వర్గ మేటికి ? స్వర్గమున కొలదిసౌఖ్యము లనుభవింతురేగాని యిట్టి సంపూర్ణసౌఖ్య మొందడు చేకూరదుగదా ! నిదానించి యాలోచింప నాలోచింప నా నవతారత్నము నా లాడ్జి చెంతనుండు మీనాక్షియని తెలియుచున్నది. కాని లలనామణిపొందు నా కెట్లబ్బునో తెలియకున్నది. మన్మథప్రేరోపితుడనై యిట్టివ్రిదేశమున చింతింప నిష్ప్రయోజనము. ఆ నవతిరత్నమిక గృహమున కరుగు వేళయయ్యెను నే నింటనుండ రాదు సాఫల్యమునకై వలయుప్రయత్నములు సాగింతును. (వెడలును)

మూర్తి :—కాంతా! గృహంబున కిక బోవుదమా? మేను నున్న నుత్సాహంతముత్సాహము బొడసూపుచున్నట్లున్నవి (మీనా తీవ్ర వలు కకున్న) బాలా! నీ వేల యీ లీల జేలపోయి మాట్లాడకున్నావు?

మీనా :—(తనలో) ఔరా! మరచిన సంగతుల జ్ఞప్తికి వచ్చినదే. కాలేజీవిద్యార్థి దామోదరు డిప్పుడీ ప్రదేశమునందుండి నిర్మించెనే ఆ మోహనాకారుని స్వరూపము మరతుమన్నను మరపు రాకున్నది. నే నేమి చేయుదును?

గీ. మదన బాధాంకురంబున మతిదొలంగ
తిన్నతిన్నగ పేర్మి సంతేజమిపుడు
పెచ్చుపెరిగెను హృదయంబు నొచ్చిమిగుల
మమత కామంబు మాన్పెడి మందుకలదె.

మూర్తి :—కాంతా! పలుక సిగ్గగుచున్నదా? ఎన్నిమారు లడిగినను ప్రత్యుత్తర మీయకున్నావు రహస్య జాలపోద్దమ్యేను నిర్మించితను.

మీనా :—మనోహరా! పలుకనందులకు కలతనొందితివా? గగనభాగంబు మిక్కిలి యుత్పాతమైయున్నదని చింతించుచున్నాను అన్యవిధంబు దలంపకుసుమా (అని కౌగలించుకొని పోదురు)

[తెర వ్రాలును.]

---

## 4వ రంగము.

[దామోదరుడు లాడ్జినందు యేకాంతమున]

అకటా! ఎన్ని విధంబుల మనంబు చక్కజేతు మన్నను దారి సుంతేని లభింపకున్నది. ఆ కాంతామణి దివ్యకాంతి మరతుమన్నను మరపురాకున్నది. మదనుడు పుష్పబాణముల నా యెడ కడుతీవ్రముగా

అన్యవిషయముల ప్రవేశింపని నీ ప్రేమను నా కంటి యోగ కుతూహాలంబొనర్చెను అహా! మన్మథ పుష్పబాణాంకురముల మరంగా మతిభ్రాంతులా వంతసంతసము లేకున్నది. ఇక నాలసించుట నపాయ మేయుని తెలియుచున్నది.

మీనా :—ప్రియమనోహరా! నీ కోర్కెకు తిరస్కారము గలదా?

గీ. మదిని నెంచితి నీవే నా మగడవంచు
కోర్కె లీడేర్తువంచు నీ కోమలాంగి
నీ ప్రియాంగన సౌభాగ్య నేస్తురాలు
పదమునమ్మిన వేరొండు బలుకదగునె.

అట్లనే మనమిక శయ్యాగృహమున కేగుదము (అని ముందు నకనడచి, ముందుజూచి) అయ్యో! ప్రాణములపై నాశనమాసలకి నచ్చెనే.

దా :—కాంతా! ఏమట్లు బేలవై బలుకుచున్నావు.

గీ. ధైర్య విక్రమాఢ్యుండు నీ దాపునుండ
రణభయంకర భీరులీ ప్రాపుజేర
నన్యవిషయాల నీ కింక హానిగలదె
ధైర్యమింకనుగొనుము యో తరళనయన.

మీనా :—శత్రువులు గాదు నా భర్త మూర్తిసింగు వచ్చుచున్నాడు. అతని వృత్తాంతమెరుంగునేని, మనల దప్పక సంహరించును. ఇక ప్రాణములుబోవును ఇందు తప్పించుకొను మార్గమయినను గానరాదు.

సర్వేశ్వరా! ఇట్టి కష్టకాలమున రక్షింప నీవే మా పాలిటిబంధువగుదువు. అదిగో! నా భర్త సమీపమునకు వచ్చుచుండెను. వచ్చి దామోదరు డిటకేల వచ్చెనని యడుగ, నే నేమి ప్రత్యుత్తరమిత్తును.

గీ. ధైర్యమును గొనిరమ్ము నా దాపుఁజేర
భయము నావంత లేక తద్భావములను
విన్నవింపుము యదిగో నా పిస్టలదిగో
యముని చెంతకు బంపుదే యొకరినైన

బాలకా! భయం బుడుగుము. రణభీకరుండగు నన యీ మానవ శ్రేష్టుడు వైరివర్గముల జెండాడునని దలంపుము. (బాలకుడు వద్దకు రాగా) నాయనా! యే నిమిత్తమున నీవు భయమందితివి. జననీ జనకులేమ యైన నిన్ను గొట్టి వెంటాడిరా ?

బాలకుడు :— ఆర్యా! మిమ్ము దర్శించుటకు బరుగిడితిని.

దామో :— ఏమీ! నా దర్శనమునకా! ఎందుకు ?

బాల :— మూర్తిసింగు భార్య మీనాక్షి తమకొక లేఖ బంపినది. ఇదిగో చూడుడు (అని లేఖ నిచ్చును)

దా :— (లేఖ తీసుకొని) కాంతా! నీ కరుణామృత మింతకాలమునకు నను వీక్షించెరా! అగణితగుణ యావ్వనాభరణమైన నీ స్వరూపమును సుఖమందఁజేయఁదలచితివా? (అని లేఖ విప్పిజూడ)

ప్రియ దామోదరునకు—

ఆర్యచంద్రమా! ఏనాంతరమున తమ దర్శనాద్భుతకలల వేనే నెంతయో భ్రమించితిని తిన్నతిన్నగా నీ యెడ నాకుగల ప్రేమవాహిని నెల్లెడ బ్రాకుచున్నది నీ యౌవ్వన సద్గుణాతిశయము లాహ్లాదకరంబులని ప్రేమించితినిగాని ప్రతిఫలంబు లభింపదాయెను కనులకు మిరుమిట్లుగొల్పు నీ సత్కాంతి నా యెడ ప్రవహించుచున్నది. ఎంత మరవవలయునని ప్రయత్నమొనర్తున్నను మనసొప్పకున్నది పంచేంద్రియములచే ప్రేమించిన యీ ప్రియురాలిని గాపాడుము. త్వరలో

నన్ను సుఖింపజేయుము. వెంటనే రసమిళితమయిన నీ శయనిొచే ప్రత్యు
త్తరము వ్రాయుము.

ఇట్లు తమ ప్రియాంగన
మీనాక్షి.

కాంతా! ధన్యుడను. అనంతరము నిన్ను కౌగిలింతోత్సవము
నొందించు నాకు మార్గ మొసంగితివి. కాని నీ స్వరూపమును నవలోకించి
నీ ముద్దులొలుకు మాటలాలించి నిన్ను ప్రేమించు దారి సుంతయునను
నాకు తెలియకున్నది. కామాంధకారబంధురమమన. నీ యీ ప్రేమ లే
ఖకు ప్రత్యుత్తర మియ్యవలెనని జూచుచున్నాను. దీనివిషయముల
బట్టి నేనేమి ప్రత్యుత్తరమిత్తును. నీకుగల ప్రేమా తిశయములకన్న
మిక్కుటముగా నాకు నీ యెడ ప్రేమగలదు కాని యట్టికోర్కె నెర
వేరునాయని ప్రశ్నింపవలసియున్నది, వనితా! వేరువిషయముల తెలిపిం
నావంతఫలము లేదు. ఏది యెట్లయినను రేపు సాయంకాలము మీ.
మందిరమున నీ పతి లేనివేళ నే నచ్చటికరుదెంతును.

బాలకా! లేఖయందలిగల భాషనములెల్ల జదివి కడు సంతోష
మందితిని నే నొక లేఖ నొసంగుచున్నాను. దీనిని కడు జాగరూకు
డవై గొనిపోయి మీనాక్షి కొసంగుము. (అని ప్రత్యుత్తరము వ్రాయుచు(
బాలకా! ఇక కాలసింపక వెడలిపొమ్ము మీనాక్షి నీ రాకకయి నిరీ
క్షించుచుండును.

బాల:—అర్యా! మంచిది. పోయివత్తును (అని నిష్క్రమించును)

దా:—దైవకరుణాకటాక్ష వీక్షణంబులచే నే నతిధన్యుడనైతిని.
(అని నిష్క్రమించును.)

[తెర వ్రాలును]

ద్వితీయాంకము సమాప్తము.

---



# రాతి

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

[మీనాక్షి యేకాంతముగా తన గృహమున]

మీనా:—ఆహా! ఏమిటా నవమోహనాంగుని, దామోదరుని యౌవ్వన విలాసరూపములు.

సీ. నిండుపౌర్ణమి కాంతి నెగడుచుండెడువాడు
మొలకమీసంబు నెమ్మోమువాడు
కుసుమలసౌరభ్యంబు కూడియుండెడివాడు
సొంపైనకన్దోయి చూపువాడు
సకలవిద్యావిశేషంబులుగలవాడు
మెరుగు బంగారుఛాయ మేనివాడు
పగలు రేయనకుండ పరిభక్తి గలవాడు
మిత్రులతోగూడి మెలగువాడు

గీ. అన్యకాంతలవెం ప్లాదమిడుట
యందు మాతృభావంబున నలవాడు
నిత్యసత్యవ్రతాత్ముడై నెగడువాడు
పుణ్యశీలుండుగాదె దామోదరుండు.

అట్టి మహాత్ముని సందేశమున హాయిజెందదలచితినే కాని, సర్వేశ్వరు చింతను దయు దలంపలేదు. అహా! శాత్రములా చిద్విలాసుని

యెడ ప్రేమ సెలయేటివలె పారుచున్నదే! కాని మానసమున కీసు మంతియు మమత జేకూరకున్నది. రక్షకా! పంపిన బాలకు డింకనూ రాకున్నాడు దానివిషయమై యోచింతమన్న నాకేమియు కర్తవ్యము లభింపకున్నది. దామోదరు డావిషయమున నంగీకరింపకుండెనా? లేక బాలుడేమైన నన్ను మోసగించి ప్రేమలేఖ నన్యుల కిచ్చియుండునా? సర్వలోకరక్షకా! కృష్ణా! నన్ను ప్రశాంత పరుపలేవా?

మదనబాణ బాధాంకురమున మదీయ హృదయము తల్లడిల్లు చున్నది. దామోదరుడు దయదలంపకున్నచో నాప్రాణము లవయు చున్నవి. అకటా! మనసు నెంతి నోదార్తమన్నను మార్గ మింతేని గానుపడద య్యె.

గీ. హృదయమా యెంతమురవస్థ మొచ్చె? కట
మదనబాణాంకురంబున మతిదొలంగె
రక్తధార స్రవించినా ర్గిణముమాడ్కి
బడియె దేహంబు ప్రాణంబు భ్రాంతి జేడు.

అదిగో! బాలకు డతి సంతోషమున విచ్చేయుచున్నాడు. నా మనోవాంఛ ఫలించినదని యెడమునేత్రి మదురు మన్నది.

గీ అరయభాగ్యంబు నిరుపేద కబ్బినట్లు
యీనుపిల్లికిజిక్కిన యెలకమాడ్కి
దాల్మి బాలుడదిగో మఖదర్శనమున
పరమ సంతోషతృప్తి నాకుకనవడె.

(బాలకుడు సమీపింప) కుమారా! మనోవాంఛ ఫలించినదా? నాచిత్త మెంతయో నీవు రాని కతంబున నగ్నిజ్వాలచే దహింపబడు నిర్జనారణ్య ప్రదేశ చందమాయెను నీ ముఖదర్శన సృష్టిచే నా

హృదయమందలి గల జ్వాలలు ప్రిశాంతమయ్యెను. కుమారా ! జరిగిన వృత్తాంత మెరిగింపుము

బాల :—అమ్మా ! నీతలంపు ఫలించినది. దామోదరు డెంతయో నీ లేఖకత నానంద భరితుడయ్యెను. ఇదిగో ! నీమనోహరుడు ప్రత్యుత్తర మొసంగెను. తల్లీ ! జననీజనకులు నారాకకయి నిరీక్షించుదురు. పోయి వత్తును. (అని నిష్క్రమించును.)

మీనా :—దైవ కరుణాకటాక్ష వీక్షణములు నాపై ప్రవహించెను. ధన్యురాలనయితిని. (అని లేఖను విప్పి)

ప్రేమానందమున నోలలాడు ప్రియురాలికి—

మనోహరీ ! రసభరితమైన నీముద్దులొలుకు ప్రేమ లేఖను గాంచితిని. అందుగల ప్రేమవాంఛల జదువ నా మనసంతయు సంతోషమయ్యెను. నీకుగల ప్రేమాతిశయమునకు మిక్కుటముగా నాకునూ గలవేకాని, అది ఫలించునా యని సందేహము నిరంతరమును సౌఖ్య భావమున జరింప సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. అబలా ! ఏదియెట్లయిన రేపు ప్రాతఃకాలమున నీగృహంబున కరుదెంతును. అందున నీ కిష్టము గలదేని తగు యుక్తి నవలంబింపుము. ఇక మనజన్మము పావనమాయ నదని ధైర్య మవలంబింపుము. ఇంతియే సంగతులు.

ఇట్లు,

నీమనోహరుడు,

దా మో ద రు డు.

సంతోషము. దామోదరునకు నేడు నాపై దయగలిగెను. అదే నా నాధుడు వచ్చుచున్నాడు. ఈ సమాచారము తానెరుంగునేని నా ప్రాణమును పోకమానదు. ఈప్రేమ లేఖను చించి యావల పారవైతును. (అని చించివేయును.)

మూర్తి :—(ప్రవేశించి) మనోహరీ !

సీ. సకలధనాఢ్య విస్తారయశోయుల
 హారులనింట నుద్భవముగాంచి
సౌజన్య సౌశాంత్య సాధుచిత్తానంద
 ములొప్పిట్టిని కోటలై యలరి
ప్రేమధారలుబారిక విమలవరాభ క్తిత్రో
 సాధుసంసేవచే మోదమంది
రాకేందుబింబ విభాజితగీర్తిచే
 నలరారుసంతేజ వంచినావు

గీ. నవలతాంత విభూషమో యువిదనీకు
 నన్యవిధముల సుంతేని నాశగలదె
 నా ర్తరక్షణమునను యండగల్గ
 బాలనీకేల యీలీల జాలిలేదె

లలనా! నలయు కార్యములు ఫలించుచుండ నీకేల యీగాసిల తనము సకలైశ్వర్యాభ్యుదయ కళలు నీదిక్కుహింతు లేకదా? అనమాన సాంసిత్యము వహించిన నీవాంఛలు నిదర్శనము లేకదా? వనితా నీకిట్టి సంశయ మొదవుటకు కారణము గ్రహింపనుమన్న స్మరణకు రాకున్న దేమి మన దాంపత్య మిత కాలము కలహామొదుంగకుండి ఇన్ను సదస్సు సంప్రాప్తించెను.

మీనాక్షి:—(తనలో) అకటా! ఇప్పుడితనికి నేనేమి ప్రత్యుత్తర మిచ్చెదను. అసత్యమాడ వలసివచ్చెనే. ప్రత్యుత్తర మియ్యకుందునేని నా ప్రాణము లిక దక్కకున్నట్లున్నవి.

గీ. అగ్నిదహించు వనముచందమునవాడు
 పతిపలుకు సూదిమొనలకులై బాపగొల్పె
 నామనోవేదనమును నేనేమనందు
 పతికినేరీతి నుత్తరం బిత్తు నేను.

ఇక నాలసించకువేని నా సందేహము బయట పడకమానదు. హృదయేశ్వరా! మీరు బయటికి వెళ్ళి యింకను రాకుండిరని, నామనస్సెంతయో యగ్నింబడి నట్లాయెను. ఇప్పుడు మీావదన దర్శనమున నాకతి జాలిగల్గెను. ఇదియే నాదుఃఖకారణము

మూర్తి :—(తనలో) ఓహో! నీవిచారకారణము వేరైయున్నది. దానిని నాకెరింగింపక నసత్యాలాపములచే మెప్పింప ప్రయత్నించుచున్నది, నేనెటులయినను దాని రహస్యమరసి దానిగల గర్వశాంతి నొనర్పవలయును. ఔరా! స్త్రీసహాసములరయ నా పరమేశ్వరున కయిన తరమా. అత్యద్భుతప్రేమచే నామనసు వంచింప ప్రయత్నించుచున్నది. గాన వీనికి దగుపాయము పన్నవలయును. [ప్రకాశముగా] ప్రేయసీ! నాగుణము లత్యంతాహ్లాదకరములుకదా? అనంతముగ ప్రేమకలలు లేక సుఖంపుచున్న మన దాంపత్య మతి కుతూహలమేకదా? నిశ్శంకచే గృహమునవిలచి భక్తవత్సలుని బ్రార్ధించుచుందుము నేనిప్పుడొక కార్యము మీాద బైటికరిగి మరల జనుదెంతును నిర్భీతిఁ సంచరింపుము. నాతలంపులకు సర్వేశ్వరుడే సాక్షి. భవత్స్వరూపమే నానిత్యానందములు. ఇక నేబోయివత్తును.

మీనా :—ఆర్యా! మంచిది.

(మూర్తి నిష్క్రమించును.)

మీా :—ఔరా! ప్రేమకెట్టి ధైర్యసాహసములు నొసంగునుం ప్రాణమునకయిన వెనుదీయదు, మానమునకైనను జంకదు. ఎట్టిసత్యవంతు నకయిన నసత్యములాడించు ప్రవీణతగలది. భాగ్యాభాగ్యములు లెక్కింపదు. కులగౌరవము లపేక్షింపదు. షడ్రసోపేతాన్నముల నాసింపదు. వైరివర్గములన్న వెనుదీయక పోరాడు యగణితస్వరూపాశక్తుల భాగ్యదేవత. ఆహా! ఎట్టిస్వల్పవిషయమున మానవుడు కట్టుబడెను. సర్వభూతముల కన్న మిక్కుటమై నీతిశాస్త్రాదివిద్యల నభ్యసించినా

యా న్యాయముల పరిశీలించి స్వయంనిర్ణయముపొందిన మానవు డిట్టి స్వల్పవిషయమున జక్కజేసిన భక్తవత్సలు డెట్టినై పుణ్యాత గల్గియుండవచ్చును.

రక్షకా! నీ సృష్టి సర్వజనసమ్మతమే కాని మనోవేదముల వారింప బ్రియత్నింపవా? నా మనోహరుడు నా ప్రాణనాథుడు దామోదరు డింకను నా గృహంబున కరుదెంచడాయెను శరీర మంత యు ప్రేమకళలు వ్రిపహించుచున్నవి. పొంగిపొరలు నేమోయని నాకు భయము కలుగుచున్నది జేయునను పాయము లెన్ని యోచింతమన్నను మనస్సు నిలువ లేకున్నది. తనువు పులకరింపులచే నైనుగుచుచున్నట్లు న్నది. చెమటబిందుపూరితమై నా హృదయము దహించుచున్నది సర్వేశ్వరా!

గీ. పెండ్లియాడిన చందంబు విభుడటంచు
ప్రేమ నిలకడలేని భ్రాంతి వెలయుచుండ
బార్థనంబున సుంతేని బడయకుండ
మోదమును గూర్పడాయె దామోదరుండు.

అయ్యో! పూర్వము నెందర సతీపతిదాంపత్యము లెడబాసి పోగాని యెరుంగను అట్లుగాదేని నా కిక్లేల నిరాశగలుగును. ఆ నవ మోహనాంగుని దామోదరుని దరిచేరకున్న యీ ప్రాణ మెందుకు? ఈ ధనధనేతరము లెదుకు బంధుమిత్రు లెందుకు ఏమిది శరీరము మయికము వ్యాపించుచున్నది. కాళ్ళుచేతులు నిస్సత్తువ వహించుచున్నవి. అక్కటా! దుర్భరము భరింపజాల దామోదరా! కాపాడ రావా? (అని మూర్ఛిల్లును.)

(దామోదరుడు—ప్రవేశము)

దామో:—ఏమిది గృహంబు నిశ్శబ్దమైయున్నది ఎందుజూచిన మీనాక్షి కనబడకున్నది. (అని మీనాక్షివంకజూచి)

సీ. అదియె సారసదళనేత్రి యదియెనచట
తనదురూపంబు నెచ్చోట దాచియుంచె
సోకవారసినందిన సుందరాంగి
ప్రేమచే మతిభ్రాంతి సంప్రీతిగనగ.

వనాంతరమున దర్శించిన ప్రియురాలి కెట్లు రూపవిహీనము య్యెను. సర్వదా సౌభాగ్యానందమున సంచరించు సారసదళనేత్రి సర్వస్వము నా ప్రేమయే కారణమైయుండును. పాపమా లతాంగి కెట్టిసంతాపమొనర్చితిని. నీ శర్తలేని వేళ నీ మందిరమున కరుదెంతునని లేఖ మూలముగా వాగ్దానమొసంగి యాలసించి యుండుటచే యీ విచిత్ర రూపమును ధరించియున్నది. తిన్నగా సమీపించి నా యీ ప్రియురాలి చెక్కుల ముద్దాడి, సంతోషమబరతును. (అని సమీపించి)

బాలా! లెమ్ము లెమ్ము నీ ప్రేమాతిశయమున కెంతయో జాలి గలుగుచున్నది. (పలుకకున్న) మీనాక్షీ! నే నాలసించితినని కోపము వహించితివా? అట్లయిన నీ ప్రియమనోహరుని క్షమింపుము.

మీనా:—(లేచి) ప్రియా! ఎంతకాలమునకు దర్శనమొసంగితిరి. నీపైగల ప్రేమాతిశయమున నా మతి వేరువిధమైయున్నది. మిమ్ముల నే నెంతకాలమునుండియో మోహింపయత్నించితినేగాని, నా ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనములాయెను. సర్వేశ్వరుడు నేడు మనకిట్టి సమయమున మన కర్పించెను. నేను నీ ప్రేయసినిగానా? (అని పాదములపై బడును)

దా:—కాంతామణీ!

సీ. అలరువిలుకాని ములుకులై యలరువేదు
వాలుకన్నుల కెంతయో బేలనైతి
బాల జాగదేల ప్రియాంగ మాలలీల
రావ కరుణింపవా దివ్యరాజనయన.

అన్యవిషయముల ప్రవేశింపని నీ ప్రేమ నా కెంతయో కుతూహలం బొనర్చెను అహలా! మన్మథ పుష్పబాధాంకురముల మరంగు మతిభ్రాంతు లా వంతసంతసము లేకున్నది. ఇక నాలసించుట నపాయ మేయని తెలియుచున్నది.

మీనా :—ప్రియమనోహరా! నీ కోర్కెకు తిరస్కారము గలదా?

గీ. మదిని నెంచితి నీవే నా మగడవంచు
కోర్కె లీడేర్తువంచు నీ కోమలాంగి
నీ ప్రియాంగన సౌభాగ్య నేస్తురాలు
పదముసమ్మిన వేరొండు బలుకదగునె.

అట్లనే మనమిక శయ్యాగృహమున కేగుదము (అని ముందు నకునడచి, ముందుజూచి) అయ్యో! ప్రాణములపై నాశనపుభావలకి న్నెనే.

దా :—కాంతా! ఏమట్లు బేలవై బలుకుచున్నావు.

గీ. ధైర్య విక్రమాద్యుండు నీ దాపునుండ
రణభయంకర భీరులీ ప్రాపుజేర
నన్యవిషయాల నీ కింక హానిగలదె
ధైర్యమింకనుగొనుము యో తరళనయన.

మీనా :—శత్రువులు గాదు నా భర్త మూర్తిసింగు వచ్చుచున్నాడు. అతని వృత్తాంత మెఱుంగునేని, మనల దప్పక సంహారించును. ఇక ప్రాణములుబోవును ఇందు తప్పించుకొను మార్గమయినను గానరాదు.

సర్వేశ్వరా! ఇట్టి కష్టకాలమున రక్షింప నీవే మా పాలిటిబంధువగుదువు. అదిగో! నా భర్త సమీపమునకు వచ్చుచుండెను. వచ్చి దామోదరు డిటకేల వచ్చెనని యడుగ, నే నేమి ప్రత్యుత్తరమిత్తును.

దామో :—మీనాక్షీ ! నీ భయభీతి వదలుము. నీ భర్తయ యినగాని, మరెవ్వరయినగాని నేను వెనుకకు జంకువాడను గాను.

మూర్తి :—(ప్రవేశించి దామోదరునిజూచి) ఓరా దురాత్మా!

గీ. ఏమిర క్రూర నాదగుభామినిపయి
ప్రేమజూపిన నిన్నిక విడువజాల
పట్టి జంపెంతు నెవరు నీ ప్రాణమింక
గాచెదెంతురో కాంచెద గలుషచిత్త.

నిర్భీతిగా మదీయగృహంబున కరుదెంచి నా ప్రియాంగనతో సంభాషించుచున్నావా ? నా కులగౌరవములు వీక్షింపక నన్నవమానింప యత్నించితివా ? దురాత్మా ! నీ ప్రాణముల గాపాడుకొనుము.

మీనా :—నాథా ! మీరు దామోదరుని అలానిందింపవద్దు

మూ :—పాపీ ! నీ వతనికి సహాయపడుదువా ? నీ పల్కులు జూడ నీ వతనిని ప్రేమించినట్లున్నది.

మీనా :—ఔను. ప్రేమించిన నీవేమిచేయగలవు నిశ్చయముగా ప్రేమించితిని. ప్రేమింపబడుచున్నాను.

మూ :—మీనాక్షీ ! తుదకు గొంతుకపై కత్తిబెట్టితివా ? ఇక నా ప్రాణమున్ననేమి . ంతలో నశించిననేమి ? ఇదిగో ! మీయిరువురి ప్రాణములు దక్కించుకొనుడు.

దా :—మీనాక్షీ ! ఇట్టి సమయమున నే నాలసింపరాదు.

(అని పిస్తలుతో కాల్చును.)

మూ :—(క్రింద పడిపోయి) అబ్బా ! దుర్మార్గుడా. నీవు నరక కూపమున బడుదువుగాక. (అని ప్రాణముల విడచును.)

మీనా :—మనోహరా ! ఏమి నీ ధైర్యసాహసములు.

దామో :—కాంతా! ఇంక మనమీ స్థలమున నుండరాదు. పరదేశమునకైన వెళ్ళి మన సుఖమార్గమునకై ప్రయత్నించవలెను రమ్ము. ఇక నాలసించిన యపాయమగును. (అని నిష్క్రమింతురు.)

---

## 2 వ రంగము

(బొంబాయి కాలేజీ విద్యార్థులు కొందరు ప్రవేశింతురు)

ప్రసాదరావు :—మిత్రులారా! మర్మార్గుడు దామోదరుడు నేదియో మూర్తిసింగుయింట దౌర్జన్య మొనర్చినట్లు తెలియుచున్నది. అదిగాక పిస్టలు శబ్దముకూడ వినబడెను. అందు నేదియొకా యపాయము జరిగినట్లు తోచుచున్నవి. రండు పోయి వృత్తాంతము కనుగొందము. (అందరు నిష్క్రమింతురు.)

(మూర్తిసింగు శవము పడియుండును. విద్యార్థులు దానింగాంచి)

ప్రసా :—ఔరా! దురాత్మా! దామోదరా! ఎంతకలుష చర్యనాచరించితివి. సకల సంపన్న గుణ సౌభాగ్యవంతుడైన మూర్తిసింగును సంహరించి, మీనాక్షిని గొంపోయితివా? దుర్మతీ ఎంతటి సాహసమునకు బాల్పడితివి. మిత్రులారా! ఇదంతయు దామోదరుని క్రూరత్వము. మూర్తిసింగును సంహరించు తన ప్రియాంగనను మీనాక్షిని గొంపోయెను. మన మీ సమయమున నాతని శిక్షించు మార్గము యోచింపవలయును. యోచించునంత పనియేమున్నది. ఈశవమే యీపాపాత్మునిపాలిటి మృత్యువగును.

విద్యార్థి :—ప్రసాదరావుగారూ! దామోదరు డెట్టి క్రూరత్వభావుడయినను మరియొకనిమిత్తమై వెనుకాడవలసియున్నది. ఇయ్యది పరిపాలకు లెరుంగుదురేని దామోదరుని న్యాయపద్ధతిగా శిక్షింపక మానరు. అదిగాక నాతడు కాలేజీవిద్యార్థియగుటచే కాలేజీ కంతటికి

నీయపనింద సంభవించును ఇత్యాది మన ప్రిన్సిపాల తెరెంగిసేని మనకు పగు ప్రాయశ్చిత్త మొనర్పగలడు. కావున దీనికి వలయు కర్తవ్యము వలంపుడు.

మోహనరావు :—మిత్రులారా! మీరు జెప్పినది నిశ్చయము మనమీ శవమును యన్యు లెఱుంగకుండునట్లు మెచ్చటనయిన మాపు చేయినలెను. అప్పుడు మన మతధన్యుల మగుదుము మిత్రుని గాపాడుటేగాక మన యపనింద నెరవేరును. అదియే నా మనోనిశ్చయము.

విద్యా :—మోహనరావుగారు చెప్పిన పదుపాయమునకు మేమందర మంగీకరించుచున్నాము.

మోహ :—మిత్రులారా! అదిగో ఆమరుగున రహస్యముగా నీశవము నుంచుదము తదుపరి వలయు ప్రయత్నములెల్ల జేయుదము.

(శవమును గొంపోవుదురు.)

(నెల్లూరునందు జయంతుడు, సుశీల లిరువురు)

జయం :—కాంతా! ఈసంసారమున జాలిసహించు టతి కష్టమైయున్నది.

సీ. సంసారమనుమహా సాగరంబునుదాట
విమలమానవ శ్రీవిష్ణుసేవ
తాపత్రయాలీల దావాగ్నికోర్వంగ
విష్ణుసేవామృత వృధగాదె
భవభయహరణంబు పరమాత్మునంసేవ
కలుషంబులనుబాపు కరుణసేవ
అరయపురాణంబు లభ్యసింపగనుండు
వీలయినదారి శ్రీవిష్ణుసేవ
గీ. సకలసౌఖ్యాంధమైన సంసారమందు
ధన్యతన్గాంచనెంచెవి తపసుతెచట.

కాలనిర్ణయ మొనరించి కాంచినారు
ముక్తిసద్భావ ధన్యతలో పువ్వుబోణి

వనితా ! మన మిల్లాంతకాల మీమాయా సంసారమున తపింప గలము విష్ణుసేవామృత మే ప్రధానమైన కల్పవృక్షము. అట్టి సంసేవనమున ధన్యత నొందవలసిన దేకాని, తదితర మార్గములన్నియు, నిష్ప్రయోజనములు. ధనమనియు, పుత్రుడనియు, బంధు వాత్సల్యమనియు, ఇవన్నియు నిష్ప్రయోజనమైన వాంఛలు. సజీవులై ప్రాణమున్నంతకాల మవి పేరానందములే కాని, మృత్యువైన వెంటనే యవి దూర భ్రాంతులగును.

గీ. ధనధనేతర పుత్రుల తలచు టెల్ల
మృత్యువెంటబడిన నవి మిథలుగాదె
ప్రాణములు గోలుపోవుచో దేవదేవుని
భజనసల్పిన ఫలమును బడయగలరె

సుశీ :—నాథా! తమ హితోపదేశ మతి యంగీకృత మయ్యెను. కావున మన మా సర్వేశ్వరుని ఏకచిత్తమున ధ్యానింప వలయును. సర్వదా మన మిట్టి సంసార తాపత్రయపాశము చే నశింప నేల ! మన యుద్యమ మిక కొనసాగింపవలయును.

పోస్టుప్యూన్ :—(ప్రవేశించి) వందనములు, ఇదిగో మీ కౌటప్పు (అని ఇచ్చిపోవును.)

జయం :—(అన్నిజాబుల జూచి) సుశీలా! బొంబాయినుండి జాబు వచ్చెను కాని, అందులో ప్రసాదరావు సంతకమున్నది. ఆత డెవరో మనకు తెలియదు.

సుశీ :—జాబును ప్రశాంతముగా జదువుడు.

జయం :—(చదువును)

మహారాజశ్రీ జయంత్ గారి సన్నిధికి—

బొంబాయి కాలేజీ విద్యార్థి ప్రసాదరావు అనేక నమస్కారములుచేసి వ్రాయున దేమనగా:—

ఆర్యా!

తమ కుమారుడు దామోదరుడు, విద్యపై ఇష్టము లేదని పైగా తిరుగుచు, పదిదినముల క్రిందట టెన్నీసు పందెమునందు రెండువేల రూప్యములు గోల్పోయెను. అటుతరువాత నాతడు లజ్జాపరత వ్యాధియుడై కాలము గడుపుచు, మూర్తిసింగు భార్యయైన మీనాక్షిని ప్రేమించెను. అంతట నిన్నటిదినమున దామోదరుడు స్వయముగా వారి మందిరమున ప్రవేశించి, మూర్తిసింగును పిస్టలుతో గాల్చి, మీనాక్షిని గూడి, ఏ ప్రదేశమునకో పారిపోయినాడు.

అందుగల శవము ప్రజల కగుపడకుండునట్లు మే మొనర్చితిమి. ఇంతియే సంగతులు.

ఇట్లు.

దామోదరుని మిత్రుడు,

ప్రసాదరావు.

అకటా! దామోదరు డెట్టి హీనస్థితికి సంభవించెను. దామోదరా! భీతిచే బొంబాయినుండి నీవెచ్చటికి పారిపోయితివి ఎందుగలవని మేము కానుందుము. జరిగినవృత్తాంతమైననాకు సుంతేని తెల్పక, నీవిట్లాచరించుట ధర్మమా? లేక లేకగలిగిన కుమారుడవని, అల్లారు ముద్దుగా పెంచి పెద్దగా జేసినందుకు ప్రతిఫల మొనర్చితివి నీ ముఖపద్మమును మేమెచ్చట గాంచనుందుము.

కుమారా! నేటికి నీపైగల భ్రాంతిని విడనాడ జేసితివా? బాలుడవై కార్యాకార్యము లెరుంగక నీవెట్టి యిడుమలకు బాల్పడితివో తెలియకున్నదిగదా! కాంతా! ఈవిధమున దామోదరుని విషయమై విచారింప ఫలమిూ సన్మానపత్రమయినను లేదు. ఏదియో కొలదిగా

లముప కాతడు సజీవుడై యుండ మనచెంతకు రాకమానడు. గతించిన దానికై చింతింప నిష్ప్రయోజనము అబలా! దుఃఖమూపుము.

(అని కన్నీరు దుడుచును.)

సుశీ :—నాథా!

గీ. కడుపునందలి నవమాస కాలమెల్ల
మోసి కనిపెంచినట్టి నా ముద్దుసుతుడు
కష్టముల గాంచకుండనే గాంచగలనె
నాథ నా ప్రాణనాథ నా ప్రాణమిదుకో.

ఇట్టి కర్ణకఠోరమైన వార్త నా హృదయమును దహించుచున్నది. నా ముద్దుకుమారుడు దామోదరుడీ లోకనిందను సంతసించెనా హా కుమారా! దుర్భరమ నీపై భ్రాంతి విడజాలను. (అని మూర్ఛిల్లును)

జమం :—సుశీలా! ధైర్య మవలంభింపుము గడచినదానికై పశ్చాత్తాపింప బాడిగాదు. (అని లేవనెత్తి) సతీ! ఇక మనకీ సంసార భ్రాంతివలదు. సర్వలోకైక రక్షకుడగు. యా సర్వేశ్వరుడే మనకు ముక్తిమార్గ మొసంగగలడు. కావున నట్టి దివ్యపదము భజించుటే సకలపాప నిర్మూలనంబగును.

సుశీ :— నాథా! నిశ్చయము నిర్జరారణ్యప్రదేశమునకరిగి దైవభక్తిచే గాలము గడుపుదము. అందలిగల కందమూలఫలాదులే మన నిత్యభుక్తములు.

జమం :—బాలా! నేనట్లంగీకరింపవలసిన దేగాని నీ విషయమైన నాకు దుఃఖమొదవుచున్నది. ఏమంటివా?

సీ. హంసతూలికతల్పమందు బరుండెడు నీవు
బండరానేలల బరుండగలవె

యతివలతోఁగూడి నాటలాడెడినీవు
క్రూరమృగంబులచేత నుండగలవె
వీణానువాద్యములు వినుచుండినీవు
పక్షినాలాపము ల్వడయగలవె
భక్ష్యభోజ్యంబుల బరగజెందెడునీవు
కందమూల ఫలంబు నొందగలవె

గీ. సకలసౌభాగ్యమైన యీ సౌధమునను
బాయజెందెడ నీ వెట్లు నడవులందు
కాలయాపన జేతువో కాంతనీవు
క్రూరసత్వంబులనుగాంచ గూలుదీవు

సుశీ:—నాథా! ఎంతపొరబడితిరి. సర్వదా యీ సౌఖ్యాతిశయములు స్థిరముగా నుండునా? అవి యస్థిరములని నీతికోవిదులు చెప్ప లేదా? తమ దివ్యచరణామృతసంసేవన నాకు లభించియుండ, మరి నాకన్యసౌఖ్య మేటికి. ఆ పరంధాముడే సర్వదా నాకు దోడ్పడ గలడు. రమ్ము దైవప్రార్థనకై గాననములకు నిష్క్రమింతము.

(అని పోవుదురు.)

## 3వ రంగము.

[దామోదరుడు, మీనాక్షిగూడి కర్నూలుపచ్చి]

మీనా:—ప్రియమనోహరా! ఇయ్యది మనకు క్రొత్తస్థలము ఇంగిలిగల సమాచారముల మన మెరుంగము. కావున మన మిచ్చటి కేయునబోయి యొకగది తీసుకొని యందు వసింతము.

దా:—అబలా! క్రొత్తస్థలమున నెందుకు. ఎచ్చటనయినా నన్ను ధిక్కరించువారుగలరా?

మీనా :—(స్వగతము) ఓహో! నిన్నటిరాత్రి సేవించిన బ్రాందికై పింకను తగ్గకున్నట్లున్నది పరిభావముల చాలా పేలుచున్నాడు. (ప్రకాశముగా) నాథా! కొంచెము ప్రశాంతముగ మాటాడుము. ఎచ్చటినైన గది జూచుటయే నా ముఖ్యాభిప్రాయము.

దా :—మీనా! ఇందలి నా కొక స్నేహితుడు దుర్గారావను వాడుగలడు. అందు మన మరుగుదుమేని సకలసౌఖ్యములు జేకూరును రమ్ము పోవుదము. (అని పోవుచుందురు)

దుర్గా :—(వచ్చు మార్గమున వారలజూచి) ఆర్యా! దామోదరా! వందనములు ఎన్నిదినములకిచ్చట ప్రవేశించితిరి. అందరు క్షేమమేగదా.

దా :—మిత్రమా! దైవకరుణారసమున అందరము క్షేమముగానున్నాము.

దు :—ఆర్యా! వీ రెవరు?

దా :—ఈమె నా భార్య మీనాక్షి.

దు :—అట్లయిన మీ రెచ్చటెన్నిదినము లుందురు.

దా :—మా తలంపు ఫలించునంతవరకుండవలయును.

దు :—అటులయిన రండు పోవుదము (అని కొంతదూరము బోయి) అదియే నా మందిరము. అందలి కుడివైపునగల గదిని నీ వాక్రమింపుము.

దా :—మంచిది (అని పోవుదురు.)

[దామోదరుని గృహమునందు]

దా :— ఆహా! సంతోషమన్న నిట్లుండవలయు సర్వదా సౌఖ్యాతిశయములు నా పాలిటి ధనమేగాని యన్యుల కవి చేకూరునా?

సీ. సూర్యోదయంబున సోడాలమిక్సర్
 బ్రాందీల జేకొను పరమసుఖము

ప్రొద్దుబారెడు లేవ భోజనతాంబూల
పరిమళవాసనలో బడయుసుఖము
మధ్యాహ్నమగునేని మమతతోనీ రాని
పాయసంబుల జెందు పరమసుఖము
ప్రొద్దుగ్రుంకక మున్నె వ్రాహిణులనుగూడి
వేడుకనలరదారి బోవుసుఖము
గీ. రాత్రి లెక్కింప పడతుల ప్రక్కజేరి
సరసములు గూర్చునట్టియా విరహాసుఖము
భళిరా భారత దేశపు ప్రజలకిట్టి
సౌఖ్యము న్నదే భువికష్టచయముగాక.

(మీనాక్షి ప్రవేశించి) మీనాక్షీ! వచ్చితివా? మేజాపై నుండు బ్రాంది సిగరెట్టుప్యాకెటు తెమ్ము,

మీనా :—నాథా! అనవరత మిట్టి దురభ్యాసమున ప్రయోజన మేమియునగలదా? మత్తు ప్రాణముల హరించునుగదా?

దా :— ఓహో! నా పలుకులకు ప్రత్యుత్తర మొసంగుచున్నావా? మంచిది.

మీనా :—నాథా! పొరబడితిరి. మీ వేదవాక్యముల దిరస్కరింతునా? కోపము లేక ప్రశాంతమున గొనుడు.

(అని బ్రాందిని, సిగరెట్టును తెచ్చియిచ్చును.)

దా :—(బ్రాందిని సేవించి) మీనాక్షీ! దీని శక్తిప్రభావములు మూఢాత్మా! నీ వేమెరుంగుదువు.

గీ. మూఢ యజ్ఞానమనుష్యులీ పుడమిదీని
శక్తి తేజోపకారవి సౌఖ్యములను
కాంచగలరొకో వాదనలో గ్రంథమునను
పరగచింతింప ధరయందు నరయగలదె.

కాంతా! దీని శేవించు కతన నేనెట్టి సాహసకార్యము లాచరించితినో స్మరించితివా? ఇటు వినుము.

సీ. కోపిష్ఠియైన యలనాడు కోపించి వాడను
ప్రియగృహాంబుల నదిని దాటగుణ నె
నన్ను హింసింపగ నున్నట్టి పాంధుల
కరవాలమున జంప కల్లయగునె
యెదురించి కయ్యంబు హెచ్చించవగబూను
శౌర్యులజంప నసత్యమగునె
మోహాంధకారియగా మూర్తిసింగును జీల్చి
ప్రోచుట నిక్కల పొల్లయగునె

గీ. శౌర్యదుర్భర కామాంచ శత్రుపతికి
హస్తిసింహంబు బోలునా యాయుధంబు
బరగస్థాపింప యన్యులు బ్రతుకగలరె
లలనరోయి వినుసత్య పలుకుగాదె.

మీనా:—(స్వగతము) ఓహో ఇతడు మత్తుచే మతి తెలియకున్నాడు. ఇతనితో మితిమీరి సంభాషించుటపాడిగాదు. అదిగో దుర్గారావు ప్రవేశించుచున్నాడు.

దామో:—(దుర్గారావు ప్రవేశింప) మిత్రమా! రమ్ము కూర్చుండుము. ఏదియో కార్యార్థమై వచ్చినట్లున్న దే

దుర్గా:—ఆర్యా! ఇదిగో ఈచిత్రపటమును వీక్షింపుము.

దామో:—మిత్రమా! ఈచాయాపట మెవ్వరిది, దివ్యకళలచే ప్రకాశించి యన్యహృదయముల నాకర్షించుచున్నది.

దుర్గా:—ఆర్యా! ఆలకింపుము.

సీ. సకలసౌందర్య విస్తార భాసంతమగా
బళ్ళారి దేశపు వనిత యుదియు
సర్వవిద్యా విశేషంబులం గదియుంచు
జగతి విఖ్యాతమగా సారసాక్షి
నిండువెన్నెల రేయి నిరసించు నెమ్మోము
గలసద్గుణాళి కాంతమిదియు
వినయసౌశీల్యంబు పెచ్చుగాంచెడి వాతి
లలిత మేలౌదీగ చెలియమదియు
గీ. వేశ్యకులమున జననంబు పృథ్విలోన
నొందియుండుటె కాని యనందియమున
దీని భావింత్రు మనుజులు మానసమున
నొక కులసతిమ శియంచు నిక్కముగా దె.

ఈమోహనాంగి బళ్ళారిపురవాసి, లలితయనుపది, ఇయ్యది వేశ్యకులమున జన్మించినను, గుణపరిభావము లతికొనియూడ వసినపి తన యిష్టానుకూలమున వరునివరింప చాయాపటములంపెను.

దామో :—అట్లయిన నీవేమిచేయ నిశ్చయించితివి ?

దుర్గా :—వివాహమాడ నిశ్చయించితిని

దామో :—దానికామె సమ్మతించెనా !

దుర్గా :—అందుకు సమ్మతించినారు ఇదిగో యీ లతాంగి జననీజనకులజాబు (అని చూపించును)

దామో :—(చూచి) అట్లయిన ముహూర్తము రేపేనా ?

దుర్గా:—అవును మీరుకూడ వివాహమునకు రావలయును.

దామో :—మంచిది. అందు వివాహకార్యములందు కడు జాగరూకుడవై యుండుము సుమా ?

దుర్గా :—ఆర్యా ! యిక పోయివత్తును.

దామో :—మంచిది (అని దుర్గారావు నిష్క్రమించును.) ఔరా ఏమి యాకాంతామణి యావ్వనరూప విలాసములు దిన్వ్యసళ లచే నుపొంగు యాచిత్రపటమువలె పద్మము నేనెందుగాంతును. దుర్గారావుకా వన్నెలాడి లభించునా! తుదకది ప్రేమించునా? అదంతయు కల్లకాకమానదు. ఏదియెట్లయినను నేనా కాంతా శిరో మణీ ఆ లలితను కళ్యాణమాడియే తీరవలెను. ఇదియే నామనో నిశ్చ యము. అట్టి సౌభాగ్యము లభింపకుండునేని, నా యీ జన్మమికేల? నాసాహస మీకేల?

మీనా :—మనోహరా! చాయాపటమునుగన్నంతనే మీరే దియో యోచించు చున్నట్లున్నదే!

దామో :—అవును యోచించుకొనుచుంటిని

మీనా :—ఏమది...?

దామో :—వివాహమాడవలెవని—

మీనా :—ఏమి? నిశ్చయమేనా?

దా :—త్రికరణశుద్ధిగా నమ్ముము.

మీనా :—అట్లయిన నాగతి హీనస్థితియేనా?

దా :—అదియేమొ నాకు తెలియదు.

మీనా :—నాథా! ఏమియో మీరిట్లడుగుచున్నారు, హాస్య మలర జెప్పుచున్నారా?

దా :—నాజన్మమే కడుహాస్యమైయుండ నిన్ను హాశ్యమాడు దునా? ఇకనాపై భ్రాంతివదలుము.

మీనా :—మనోహరా! ఎల మీరిట్లడుగుచున్నారు మీపై భ్రాంతి విడచి యితరులపై బెట్టుదునా?

దా :—మీనాక్షీ! ఆ అధికప్రసంగము నిష్ప్రయోజనము. ఇక నాకు నీ ప్రేమవలదు.

మీనా :—ఆ! ఇది నిజమా ? దురాత్మా! ఎంత క్రూరత్వము నకు సిద్ధపడితివి ?

గీ. పెండ్లియాడినభర్తను పిప్పలెత్తి
కాల్చినాడవు దాన నే కనికరింప
ప్రియుడవంచును యుర్వి తాడు బెట్టినావు
మాన్యజన్మంబు స్థిరమందు మమతగలదె

పాషాణహృదయా! నమ్మించి గొంతుపై కత్తినిడుట నీకు ధర్మమా ?

దా :—పాపినీ! నీమాయాపలుకులచే నాకేమి ప్రయోజనము ఇకను నాలసింతువేని మదీయుతలంపు నిష్ప్రయోజనమగును. ఇదిగో పోవుచున్నాను.

మీనా :—ఔరా! కలుషాంధా! నుంతేని కనికరము లేక పోవుచున్నావా ? నీదుష్కార్యమునకు హాసించిన సర్వేశ్వరుడు నిన్ను శిక్షింపకుండునా ? ఓసర్వభూతములారా! సూర్యచంద్రులారా! ధర్మ వేత్తలారా! మీరైనా దామోదరుని హృదయమును జక్కజేసి నన్ను సంతోష జరుపలేరా ? ఇట్టి అన్యప్రదేశమున నేనెట్లు జరింప గలను ఎట్లు సుఖింపగలను దైవమా! ఇట్టి దుస్సహములు భరింపజాల వనాంతరమున ఏకపక్షి చందంబున నేనెట్లు జీవింతును. ఎట్లు ప్రాణ ముల భరింతును. సర్వేశ్వరా! ఇదియే నాభక్తిపూరితమైన నమస్కా రములు. నేనిక ప్రాణములు వదలుచుంటిని. ఓ భారతదేశీయ సోదరీ మణులారా! కలియుగవంచకుల వీక్షించితిరిగదా ? ఇట్టి నాయీ పరి తాపము హెచ్చియుండుటచే నాప్రాణములు దొలంగుచున్నాను. నా యీ ఆత్మహత్యకై ఈదీనురాలిని దూషింపకుడు, ఇవియే నా యీ సోదరీమణులకు వందనములు.

(అని చెంతనున్న తాడును తీసుకొని మెడలో వేసి)

గీ. అరయమాంగల్యమునుగట్టి యాదరించి
నిండుప్రేముడి నన్ను మన్నించునట్టి
ప్రియతమా నీకు మృత్యువై వెలసితయ్య
నీవుబోయినచందాన నేనువత్తు
నిదె నమస్కారపూజ్యము లిత్తుగొనుము.

(అని ధ్యానించి పురకప్రయత్నించేసరికి కాసిపడను యోగీం
ద్రుడచ్చటికి కరుదెంచి అమ్మా ఆగుమని చెయ్యిపట్టుకొనును).

కాసి :—(ప్రకాశముగా) అమ్మా ! ఆగుము నీ వెట్టిసాహసము
నకు సిద్ధపడితివి. ఆత్మహత్య ఎట్టిపాపపూరితమైనదో స్మరించితివా ?

మీరా :—మునితిలకమా ! మాయాప్రపంచమునగల వంచ
కుల యోచింప యీ జన్మమెందుకని విరక్తికలుగుచున్నది.

కా :—అమ్మా ! నీవీ సమయమున ఆత్మహత్యకే సిద్ధపడ
కుము. సకలరక్షకుడైన యీశ్వరుడే నిన్ను గాపాడును. కావున యీ
వైరాగ్యములనీడి భక్తవత్సలుని ప్రార్థించి ధన్యతనొందుము రమ్ము
మా నిలయమున కరుగుదము. భక్తులతో కాలయాపన మొనర్పుము.

మీ :—(తాడును తీసివేసి) ఆర్యచంద్రమా ! తమ హితోప
దేశమున ధన్యురాలనైతిని. మాయాప్రపంచకలలు దుఃఖమునకు కార
ణము. అసామాన్యుల హరించెడిది ప్రేమయేకాని వేరొండులేదు. నా
దుస్థితి కారణము నా గర్వమేకాని మరెవ్వరునుకారు.

కా :— అమ్మా ! కడచినదానికై చింతింపఫలమున్నదా ?
మానవు డేకాలమున కేదుస్థితికి బాల్పడునో యెవ్వరెరుంగుదురు.
లోకరక్షకుని దివ్యచరణామృతమే ప్రధానమైయుంచును. తల్లీ ! యిక
నాలసించిన ప్రయోజన మేమి? రమ్ము మదీయనిలయమునకు కరుగుదము.

(అని నిష్క్రమింతురు.)



# రౌడీ

## చతుర్థాంకము.

---

### ప్రథమరంగము.

(బళ్ళారియందు లలిత జననీజనకులు)

సుగం:—ఔరా! కాలచిత్రము అనవతరమిట్టి సంసారమున దుఃఖమనుభవింపవలసిన దేకాని, సుఖమేమన్మాత్రమైనా చేకూరదు కదా? మాధవా!

సీ. హంసధ్వనీలోల యవతారములమొందు
దాల్చి భూయశమున దనరినావు
కేదారివాసమీ కృపాదర భక్తావి
లిధతిపైబొర్లాడ వెలసెసుఖము
సారస్వతీగంగ సంతతో ఇతులొంద
మీదు కరుణఁండ మెలగగాదె
కళ్యాణగాత్ర మీ కారుణ్యరసమున
జగతికి విఖ్యాతమై మిగులదనరె
గీ. మోహనాకార మీదగు సాహసమున
దనుజవీరుల పొంకంబు యణగెగాదె
కన్నవిటుసేయ నేలనో కమలనాభ
నిండుదయతోడ గావవే నిర్మలాత్మ.

రక్షకా! ప్రేమానందమునగన్న నా యీ సుకుమారి కళ్యాణ మునకై ప్రయత్నించుచున్న నా క్షేమము స్మరింపకున్నది. నా హితోప దేశముల కామె సమ్మతించుట లేదు. తల్లి యెంతవినయవిధేయత చే ప్రార్థించినను జెవిబెట్టకున్నది. ఆమె హృదయమునగల మర్మమైనను విన్నవింపకున్నది. (అని భార్యతో) కాంతా! కుమార్తెయైన లలిత కెన్ని బోధించినను ఫలములేకున్నది. కనులార కళ్యాణోత్సవముగాంచ నభిలషించు మనకు సర్వేశ్వరుడట్టి తరుణము లభింపజేయకున్నాడు.

గీ. వంయు సదోబ్ధదలన్నియు వ్యర్థమయ్యె
నీరజాక్షుని సంసేవ నీటగలసె
వరయ పెండిలియుత్సవం బరయలేక
దిక్కులేనట్లు బడితిపటా దిక్కదదె.

అబలా సివైనా బాలికకు తగినహితోపదేశముచేసి నాకు సంతోష మొసగ లేవా?

పుష్ప :— మనోహరా! ఎన్నివిధములని ప్రయత్నింతును. ఎంతముద్దాడి చెప్పినను వినకున్నది. తా నేదియో మారప్రయత్నము నందున్నట్లు దెలియుచున్నది నిన్న మనమునిశ్చయించిన దుర్గారావుకు కబురుజేసితిమిగదా? అతడీవేళనరికి గృహాంబున బ్రవేశించును. ఏమైననూ ఈనాడే కళ్యాణము నెరవేరబ్రయత్నింపవలయు బాలబాలికలు జననీజనకులంచ యధీనమందుందురుగదా! దానికై చింతయేల?

సుగం :—అటులయిన వివాహ మీనాడే నిశ్చయింతము. వల దని చెప్పినంతమాత్రమున వినకూడదు. దుర్గారావు తప్పక రాకమానడు. నేనుపోయి బ్రాహ్మణోత్తములను తీసుకొనివత్తును.

(అని నిష్క్రమింతురు,)

లలిత :—అమ్మా! నా పాలిటి యమమాతలై మీరు కలుష వాక్యము లుపదేశించుచున్నారు నా కా దుర్గారావుపై యిష్టము లేదు నే నతనిని వివాహమాడను. ఇదియే నా నిశ్చయము.

పుష్ప :— అటులైన నింకెవరిని అంగీకరింతువు.

లలి :— ఇదిగో యీ చిత్రపటము వీక్షింపుము. ఇట్టి మదన స్వరూపుని దామోదరునే ప్రేమించితిని. ఇతడే నాకు భర్త. నన్ను సౌఖ్యానందమున దరింపజేయు నా భాగ్యదేవత యితడే.

పుష్ప :— అతని స్థితిగతులెరుంగకుండా మేమతని నెట్లంగీకరింతుము. ఈ వృత్తాంతము మీ తండ్రి కెరిగింపుము. అత డేయభిప్రాయమొసంగునో దాని నంగీకరింపుము. అదియే నాకును సమ్మతము.

లలి :— అమ్మా ! ఒకరి యభిమతముల నే నంగీకరించు టెందులకు ? నా సుఖమునకై నేను ప్రయత్నింపవలసిన దేగాని యన్యహితోపదేశమెందులకు మీ పలుకులు నాకు సమ్మతించుట లేదు.

పుష్ప :— అవును కాలవైపరీత్యమునుబట్టి వినాశకాలమునకు మా హితోపదేశములు నిష్ప్రయోజనములు.

గీ. తల్లిదండ్రుల సత్కీర్తి దలపకుండ
నార్యవేదోక్తముల ను నీ వరయకుండ
స్పృహజవాంఛయు నిష్ప్రయోజనముగా దె
కాలవిపరీతముల నీవు గాంచలేదె.

నీ యిష్టానుసారమున జరించి వివాహమాడిన, కష్టమేకాని సుఖము లభింపదు.

లలి :— అమ్మా ! చాలా పొరబడితివి.

గీ. మద్రదేశనాయకుని కుమారై సత్య
వంతుపై భ్రాంతిగల్గి వివాహమాడి
యమునిచే దివ్యవరములనంది దివికేగి
పతినిరక్షించి సౌఖ్యంబు బడయలేదె.

కావున ప్రేమించి వివాహమాడిన సర్వసౌఖ్యములు చేకూర కుండునా?

(సుగంధుడు బ్రాహ్మణోత్తములను జేకొని ప్రవేశించును.)

సుగం :—కాంతా! పుష్పవతీ! కళ్యాణమునకు వలయు పరికరములు చక్కజేయుము.

పుష్ప :—అట్లొనర్చిన ప్రయోజనమున్నదా?

సుగం :—ఎందుకు?

పుష్ప :—అమ్మాయికి దుర్గారావుపై నిష్టము లేదట

సుగం :—మరెవ్వరినైన ప్రేమించినదా?

పుష్ప :—ఇదిగో ఈఫోటోను చూడుడు.

గీ. ఘనత కర్నూలు దేశపు మనుజుడంట
ముద్దులొలికెడి మోము సంపూర్ణుడంట
గుణగణ ప్రభావసందలు గలవంట
నరయ దామోదరంబని బరగునంట.

అట్టి ఈపురుషవర్యుని కళ్యాణమాడ నిశ్చయించినది. ఆమె మనస్సుకు దుర్గారావును గురించి బోధించినను ఫలము లేకున్నది.

లలి :—జనకా! ఇష్టములేని పెండ్లికి నన్నంగీకరింపు మందువా? ఇది నీకు ధర్మమా!

సు :—ధర్మమో, యధర్మమో, యానల యోచింతము. దుర్గారావునే వివాహమాడవలెను.

లలి :—ఆ మనుజాధముని నేనంగీకరింపను.

సు :—ఇదినిజమా?

లలి :—త్రికరణశుద్ధిగాగా నమ్ముము.

సు :—ఔనే! తలిదండ్రులకు నీవొసంగు భక్తి ఇదియేనా?

నాప్రియత్నమెట్లు విఘ్నమగునో చూచెదను. అదిగో దుర్గారావు గారు ప్రవేశించుచున్నారు.

లలి :—జనకా—

గీ. కలుషమతముల బోధింప ఫలములేదు
 భ్రాంతి లేనట్టి పెండ్లిలి ఫలము లేదు
 వారువచ్చిరు పోదురు మీరటన్న
 ఫలము లేదయ్య పాపంబు గనుగునందు

దుర్గా :—(ప్రవేశించి) మామగారికి నమస్కారములు

సు :—అయ్యా! కళ్యాణసిద్ధిరస్తు. మేము వివాహమునకై పలయు ప్రయత్నము లొనర్చితిమి ఇది మంచి ముహూర్తమని యార్యులు నిశ్చయించినారు.

దు :—ఆర్యా! మంచిది. తమకరుణామృతమున కడుధన్యుడను. యీలలితను నేకళ్యాణమూడ నాభాగ్యలత దిన ప్రకాశ మందుట నిస్సందేహము.

గీ. అరయ సముద్రాలు పకమై పొరలుగాక
 కోమలంబైన గగనంబు గ్రుంకుగాక
 తల్లిదండ్రులు ఋత్విక్కుల దాల్చుగాక
 నిన్ను జేపట్టుటనుమాట సున్నగాదె.

సు :—భూసురులారా ఏమి చూచెదరు. మంత్రిపారాయణములు గావింపుడు.

(అనిలలితనుపట్టి పీటలపైకూర్చునబెట్టి పట్టుకొనును.)

లలి:—జననీజనకులారా! ఈసుకుమారిని, లలితను, నీప్రేమంపు రక్తధారను, కిరాతును వప్పగించుచున్నారా? పాషాణహృదయమైన మీహృదయముసుంతైన జాలిగలగకున్నదే! అహోరాత్రిములు

ప్రాణుల మారోపాయమునబట్టి ఖండించి, జీవించు బోయలకైనా దాక్షిణ్యము వానిని సంహరించువేళ గల్గునేకాని, మీకట్టిదాక్షిణ్యము కుమార్తెపై లేదుగదా! మిమ్ము నేను తెలిదండ్రుల నెందుకు, కుమార్తెను మీరిట్టి నగౌరవముజూప ప్రయత్నించుచుండ, యీనిర్భాగ్యురాలికి ప్రాణంబులపైనా శయేందుకు? మనోవిరక్తియైన కళ్యాణమేందుకు? కుమార్తెయని కానంతైనా ప్రేమజూపని మీజన్మమిక కాల్చరా మీధనధనేతరములెల్ల మిమ్ము దహింపకమానునా? ఓ పౌరులారా! సకలదుర్జన శిక్షావిచక్షణ దక్షులారా! మతప్రాణప్రియులారా! ఇట్టియసమ్మతమైన వివాహమునెరవేర్ప మీకుధర్మమా? ఈసుకుమారిని కిరాతున కప్పగింప, మీకు శ్రేయస్కరమా? అల్పురైన నన్నీయు జననీజనకులు దురాభిప్రాయముల నొనసాగింప మీరుంబొడిదురా? ఇట్టియనుచితకార్య మవలంబింప మన భారతమాతకు నిష్కళంకమే కదా! ఓ యష్టదిక్పాలకులారా! మదీయ ప్రాణేశ్వరుని మీరైన నీయాస్థలమునకు దోడ్కొనిరారా ఓసూర్యచంద్రాదులారా! న్యాయాన్యాయముల పరిశీలించి మీరైనానాకు సహాయమొనర్పరా? ఓ కృష్ణా! దుష్టవంశదహనా! ఆపత్కాలమున నన్నుగాపాడవా! వీరలు నాపాలి యమదూతలై బాధించుచుండ నూరకవీక్షింప మీకు ధర్మమా? న్యాయాన్యాయము లవలంబించి శిక్షింప మీకు సామర్థ్యము లేదా? ముందెన్నియో ప్రాణులరక్షించితివని యార్యోక్తులు జెప్పుచుండ వాటిని నమ్ముట కాధారమేమైనగలదా? అకటా! ఎంతప్రార్థించినను సుంతైన సహాయము లభింపదాయెగదా? మితిమీరిన యరపుచే నాకంఠము గద్గదస్వరము చందమాయెనే! హా దామోదరా! మదీయ ప్రాణప్రియా! ఇట్టి యాపత్కాలమున నన్ను రక్షింపరావా? నీయధరామృతమును గోలనివ్వవా, ఇక నీప్రియాంగనను ప్రాణములు పోయినపిమ్మట నీవేమి సుఖింపగలవు? నీవు నన్ను వివాహమాడెదవని తెలియజేసి, తుదకు మోసగించుట

మీకిది ధర్మమా! అయినను కానిమ్ము. సర్వేశ్వరుడగు కృష్ణభగవానుడు శుదీనురాలికి దోడ్పడకుండునా? (అని దుఃఖించును)

పౌరు :—అమ్మాయి! ఊరక కాలయాపన మెందుకు. నీ తలిదండ్రుల కోర్కె నెరవేర్పుము.

లలి :—అయ్యలారా! ఇట్టి యజ్ఞానుని వివాహమాడుటకు నేను సమ్మతింపను విద్యయేకదా సర్వకార్యములకు భూషణము.

పౌ :—అనుభవలయిన పెద్దలమాట దిరస్కరింతువా?

లలి :—పెద్దలన నెవరు? సంఖ్య మీరినంతనే పెద్దలగుదురా? సుజ్ఞానమున బ్రవర్తించు సత్కార్యము లాచరించువారలే పెద్దలని కొనియాడబడుదురేకాని, దుష్క్రియలాచరించువారు పెద్దలగుదురా? పలు మీరిట్లు పరితపించెదరు? నాకీ వివాహము నలదు.

సు :—ఔనే కుర్మతీ! బ్రాహ్మణోత్తములను పూజించితివా? (అని దుర్గారావుతో) అయ్యా నీవుపీటపైగూర్చుండుము. (అని బ్రాహ్మణోత్తములతో) ఆర్యులారా! ఇకమీ కార్యముల నెరవేర్చుడు అని ఆమెను పీటపైకూర్చుండ బెట్టును.)

(తెరలో)

సీ. ఆగుడాగుడు, మీ కార్యమాపలదో ప్రసి!
యాత్మరక్షణ మార్గంబు లరయుడయ్య
పెండ్లివేదిక శవముల పెంటగాగ
జరుగుకాలంబు వచ్చెనో సభికులార.

ఓహో! బ్రాహ్మణాధములారా! ఇట్టి యన్యాయ కార్యము నెరవేర్ప మీకుధర్మమగునా? అనుచిత కార్యమున ప్రవేశింప బుద్ధిమంతుల నవ్విదానమగునా? అబలను నిస్సహాయిని, క్రూరత్వమున బంధించి యిష్టములేని కళ్యాణమొనర్ప నేరియస్కారమా? తల్లిదండ్రుడు

లావంక సేనిలచి కమార్తె మనోభీష్టము లెఱుంగక కండ్లగట్టి నూతిని బడద్రోయ ధర్మమా? ధర్మమన నెందులకు మీయీదురుద్దేశము లకు మదీయపౌరుషమే ప్రధానమైయుండును. కావున మీప్రాణముల గాపాడుకొనుడు.

లలి :—(స్వ) ధన్యురాలను నన్నుప్రేమించి సుఖంపజేయుచున్న నా ధనరాశి దామోదరుడిట ప్రవేశించుచున్నాడు. తన వీర్యప్రతాప మిందు వెదజల్లి మదీయజనవీజనకులకు పాయశ్చిత్తమొనర్ప బనుచుచున్నాడు. భాగ్యము నిర్భీతిని ధరించితిని.

సు :—(స్వ) అకటా! వివాహము జయప్రదముగా కొనసాగకుండెనే, ఎవడో దురాత్ముడు ప్రాణముల గాపాడుకొమ్మని ప్రేలుచు ప్రవేశించుచున్నట్లగపడుచున్నది. ఇది యోచింపదగినపనియే తెలియుచున్నది దీనికి వలయుప్రయత్నమొనర్తుమన్న కాలుసేతులాడకున్నవి. (ప్ర) పౌరులారా! మదీయప్రాణరక్షకులారా! మీకీయాపత్కాలమున నాకు సహాయమొనర్పుడు. ఎవడో వ్యర్థప్రలాపి ప్రాణముల గాపాడుకొమ్మని ప్రేలుచున్నాడు. మదీయధైర్యసాహసములు నలువంకల ప్రాణాపేక్షకై పరుగిడుచున్నవి. శరణాగతుండనైన నాకు ప్రాణభిక్ష యొసంగుడు.

బ్రాహ్మ :—పప్పుదప్పలాలకొచ్చి నిప్పుమ్రింగినట్లు మా కెందులకీగొడవ బ్రాహ్మణులు పిరికివారని మీకు తెలియదా? కయ్యమనిన మాకు సమ్మతింపదు.

పుష్ప :—నాథా! నాకు తత్తరగల్గుచున్నది ఆక్రూరాత్ముడాడిన దుర్భాషలకు నా ప్రాణములు బోవునట్లున్నవి.

గీ. నాథ నాప్రాణనాథ యిన్నాళ్ళనుండి
సుఖతరంబుగ ప్రేమించి వోద్యమంద

జేసినారము పెక్కుగు చేష్టలెల్ల
ప్రాణమే మతి గాపాడ ఫలముగలదు.

సు :—మనోహారీ! ఎందుకుబేలవై భయపడుచుంటివి. బ్రహ్మ లలాటమున లిఖించినవ్రాతకు వేరొండుగలదా?

గీ. ఎందరో రాజులట మృతినొందినారు
ప్రాణతుల్యంబుపై భ్రాంతి బరుపవలదు
గండమింతేని తొలగునే కమలజాక్షీ
కాలమేరీతి గల్గునో కాంచగలమే.

కావున మన ప్రయత్నమిప్పుడే కొనసాగించి ధన్యతగాంచల యును. ఓ పౌరులారా! మీరు యీ కార్యముల కొనసాగించి కళ్యాణోత్సవము సిఘ్రతిగా నెరవేర్పుడు. ఈ దుర్మార్గరాలు లలితవే యంతటికి గారణము ఇక వదలకుడు.

పౌర :—అమ్మా! కార్యము జయప్రదముగా నెరవేర్చి మీ జననీజనకులకు వాసిబెట్టుము.

దా :—(ప్రవేశించి) ఏమి జననీజనకులకు వాసిబెట్టుమనియా (అని నవ్వి) మంచిది. వాసిబెట్టుటను మాటకల్ల జననీజనకులపాలిటి మృత్యువై యీమె జన్మించినది మీరిక ప్రాణములపై నాశవదలుడు.

దుర్గా :—దామోదరా! నీ విట్టిద్రోహమునకు బాల్పడితివా? ఇది నీకు ధర్మమా?

దా :—ధర్మమో, యధర్మమో నా ప్రయత్న మికమానను.

సు :—దురాత్మా! నా యింట ప్రవేశింప నీ కేమిహక్కుగలదు నా కుమార్తెవిషయమున నీ కింతపట్టుదలయేల. కావున నా యింట నుండి వెడలిపొమ్ము.

దా :—దుర్మతీ! ఏమని చూపించితివి. ఇక మితిమీరి ప్రేలిన ప్రాణవ లికదక్కవు ఇదిగో మదీయశౌర్యరాసిని పట్టుటకు పిష్టలు పీక్షింపుము. (అని పిష్టలు చూపును).

లలితా! నీ వావంతయు భయమందపనిలేదు. నిర్భీతినవహించి అదిగో కారునందు గూర్చుండుము. నీ రెవ్వరాటంక మొనర్తురో వీక్షింతును. ఇక నాలసింపకుము.

లలి :—మనోహరా! ధన్యురాలను. తమ యిష్టానుకూలము న కారునందు బ్రవేశింతును, (అని పోయి కారునందు కూర్చుండును)

సు :—దుర్మతీ! ఎందుపోగలవు యీ తుచ్ఛుడు చెప్పినంతనే ధైర్యముగల్గెనా, మీ శౌర్యసాహసముల వీక్షించెదము.

(అని వెంబడింపబోవుదురు.)

దా :—తుచ్ఛులారా! హెచ్చుగమాటలాడి యిచ్చవచ్చిన ట్లాచరింప మీ ప్రాణములిక దక్కవు. ఇదిగో మీ ప్రాణములు గాపాడుకొనుడు. (అని పిస్తలు పైకెత్తును.)

అందరు :—హా దైవమా! రక్షింపుము. రక్షింపుము,

(దామోదరుడు కారునందు ప్రవేశించి నిర్భీతిగా వెడలిపోవును.)

వృద్ధ :—దుర్మతీ! జననీజనకులయెడ నిర్దయనవహించి కిరాతుని వెంట బోవుచున్నావా?

సీ. నవమాస కాలంబు యువిదరో మత్యుద
రాన ధరింపంగ ప్రతిఫలంబు
పుట్టినంతన నతియుత్సాహ మిలితమనా
పరగ ప్రేమింపంగ ప్రతిఫలంబు
విద్యయందలి కీర్తి వెలయునంచని నిన్ను
పఠనచేయింపంగ ప్రతిఫలంబు
మెట్టివేళలయందు నేమిగావలెనన్న
భ్రాంతిచేనర్పింప ప్రతిఫలంబు

గీ. వనిత బిడ్డరమ్మంచు నిన్ దరిజేర్చి
కుశల ముగ్నగ దువ్వియు కొప్పుబెట్టి
పాఠశాలకు గొంపోవ ప్రతిఫలంబొ
లేక నే జేయు సుకృతా నీకఫలమో.

వనితా! అల్లారుముద్దుగా బెంచి పెద్దజేసి సకలవిద్యావిశేషములు చేకూర్చ మంచి ప్రతిఫల మొనర్చితివి నీ యట్టి పాషాణహృదయ నీ దేశమున ప్రబలుచుండుటచే భరతమాత వ్యసనమును భరింపలేక వచ్చుకన్నీటి ధార ప్రపంచమును నిర్మూలించునేమోయని భయంబుచే సముద్రశరంబున కన్నీరిడుచుచు లోకరక్షకుని భజించుననుట నిస్సందేహము. ఇట్టి యీ పరమపావనమైన భారత దేశమునకు నిష్కళంక మొనర్చిన నీ యీ చేష్టలు కలుష పూరితములే కాని పుణ్యపాత్రలుగావుసుమా?

తలిదండ్రులకు ధిక్కరించు నీ యీ జన్మము కేతారణముగాక, సుజన్మమునకు కారణము గాదుగదా? మాతాపితలను దూషించిన కలుషపూరితమైన నీ హృదయ మీనస్మాత్రమైన సంతసింపగలదా? పాపీ! నీ బంధుమిత్ర వేదాంతులనైన నమ్మింత నవమానించితివా? సర్వలోకరక్షకుండైన యీశ్వరుడీచారిత్రము సైతించకుండునా? నీ దురితముంకు కాలుడు సహించునా? కులగౌరవధర్మము లెరుంగక నెవడో కలుషాత్మునివెంట నిష్క్రమించితివా? నీ కంత్యకాల మాసన్నమగుటచే యిట్టి వైపరీత్యములు చేకూరెనుకాబోలు మమ్మనగౌరవించిన నీ శుశ్రూష మా కెందులకు బిడ్డయని దలచుటెందులకు మాకు సంస్కారమొనర్చి వాకిబెట్టని కుమార్తెగల్గిన నేమి? గతించిన నేమి? కావున నీ విషయమై పరితపింప మాకు తలవంపులగును. (ప్రకా)

నాథా! నీ వింకను దుఃఖించిన ప్రయోజన మేమి? సర్వవేదసారము లెరింగియు కుమార్తెవిషయమై నీ విట్లు చింతింప సధర్మమగును సర్వవేత్తలగు మీకు జెప్పవలసిన దేమున్నది.

గీ. చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబులోనుదా దలపడేని
పుట్టినేటికి తల్లుల పొట్టచేటు
అనిన వాక్యములు లోకవిదితము లేకదా ?

సు :— మనోహరీ ! సర్వాయెఱింగిన వాకే యీ చారిత్రమును దలంప దుఃఖమధికమగుచున్నది. కుమార్తెయని కడుపుగట్టి యన్యాన్యాను రాగమున బెంచి పిచ్చిజేసినందులకా లలిత ప్రతిఫలమొసగెను. ఇంక నన్యులవిషయమై చర్చింపనేల? యీకలికాలమున ప్రబలు మూర్ఖులత్యంత దుర్వృత్తములకు బూనియున్నారు.

గీ. పరులధనముల హరియింప బాగటంచు
స్వేచ్ఛజరియింప సుఖమవలీల జెందునంచు
ప్రబలుచున్నారు మూర్ఖులీవసుధయందు
యేల యీలీల జూడగ ఫలముగలదె.

మరియు,

గీ. తల్లిదండ్రుల జంపితా ధనముల్ల
నపహరించిన యందంబు ననుసటంచు
చేయునదృశవేత్తలు చెలగుచుంద్రు
దారులందలి వేచియు దారిబోవు
పిన్నపెద్దలగాంచి సంప్రీతిచేత
పుత్రరెబిడ్డలుగాజేసి పొట్టనింపు
మూర్ఖులందలి జనియింప ముక్తికలదె
బేలసంసారమందలి జాలిగల్గి
మాయమాటల వీక్షించి మమతగల్గు
బెల్లజన్మంబు దుకితంబు బోసగుగాదె
గానమనమిట్టి సంసార గాథమందు

మునుగ నేలకో మరణింప ముక్తిగల్గు

కావున మనమీ జన్మమును త్యాగమొనర్చుటె యుక్తమని తెలియు చున్నది. అట్టి స్వహత్యయెట్టి పాపపూరితమైనను సరియేకాని, ఈమాయ జీవులజూచి, సహింపజాలను. దీనికై నీయభీష్టమేమి?

ప్రవ్వ :—నాథా! అనారతము తను చరణామృతధారల గ్రోలుచున్న నీప్రియాంగన, నీకు ప్రత్యుత్తర మొసంగునా? తమ యభీష్టముల కెల్ల సంసిద్ధురాలనై యున్నాను.

గీ॥ అగ్నిబడమన్న బడుదునే నాగనందు
జలముబడమన్న నద్దాని నలుపుదేను
మృత్యుగాంచుమటన్న నే మేనువిడతు
నాథ! తమవాక్యములకెంతో మోదమలరె

ఇకనాలసింపక తమ మనోభీష్టముల నెరవేర్చుకొనుము సత్వరమా సర్వేశ్వరుని సన్నిధానమున కరుగుదము.

సు :—మిత్రమా! దుర్గారావుగారూ! నేడు నిన్నింతయవమానించినందులకు మమ్ము క్షమింపుము. క్షేమముగా తమ నిలయమున కెళ్లుడు

దుర్గా :—ఆర్యచంద్రమా! ఈమాయ జీవనోపాయముల తమ దివ్యకరుణామృతమున గ్రహించియు, నాకీమాయ సంసారమెందుకు, ధనమెందుకు, ధాన్యమెందుకు, బంధుమిత్రులెందుకు, సాధువులైన తమ హితోపదేశ మంగీకరింప సంసిద్ధుడనై యున్నాను. గావున ఈదీనుని పుత్రునిచందమున భావించి, మోక్షమార్గ మొసంగుము. ఇదియే నాకోరిక!

సు :—బాలకా! నీబుద్ధిలకు కత్యంతవిశ్రాంతినొందితిమి. మనకు సంసారతాపత్రయమున సుఖము లేదుగాన సర్వేశ్వరుని ధ్యానించి. యాతని సన్నిధానమున, జేరుదము, ఇది నీకు సమ్మతమేనా?

దుర్గా :—అయ్యా! మాటిమాటికి నన్ను బ్రశ్నింపనేల, మీరేమన్న నదియే మనోసమ్మతమై యున్నది కావున మనమూ యాదిమధ్యాంతరహితుని ధ్యానింతము.

(అని ముగ్గురు యేకచిత్తులై ధ్యానించుచుందురు)

సు :—(కొంచెము సేపైనపిమ్మట) ఎచ్చటది ప్రశాంతమైన హరికీర్తన, కమలనాభుడే మమ్ము జేర సంప్రీతిచే వచ్చుచున్నట్లున్నది. సతీతిలకమా! దివ్యమోహాస్పదమైన ఈహరికీర్తన నాలించితివా? మనము నేడు కఋధన్యులమైతిమి.

దుర్గా :—నమ్మినదా సులకకు పర్మేశ్వరుడు సేడుగన్గొజేయునా!

పుష్ప :—ఆనంద తేజు దివ్యస్వరూపమును, గాంచుతరుణ మబ్బెనా? కృతార్థులము.

(గానముచేయుచు కౌశికమహర్షి ప్రవేశించును.)

కౌశి :—భక్తులారా! ఎట్టిసాహసమునకు సంసిద్ధులైయుండిరి. సుగంధా! నీవు సర్వవేత్తవయ్యును, ఇట్టి పాపకృత్యమునకు అంగీకరించితివా?

సీ. పంచవేదాభ్యాస పఠనజేసిన నీవు
ప్రాణహత్యకునిటు బరుగుదేల
మంత్రహోమంబుల మమతనల్పెడి నీవు
ప్రాణహత కు నిటు బరుగుదేల
దైవప్రార్థనమందు దనివి గల్గిననీకు
ప్రాణహత్యకు నిటు బరుగుదేల
సర్వభూతములందు జాలిగల్గిన నీవు
ప్రాణహత్యకు నిటు బరుగుదేల
గీ. నిత్యజీవోపకారమై నిలచియుండు
సాధువర్గములకెల్ల జాలిగూర్చు

దైవచింతన మనెను పదంబుగలుగ
ప్రాణహత్యకు నీవిటు బరుగు దేల.

కావున మీరీ సంసారమున యెంతవిరక్తిచెందినను. యిట్టి లోకనింద కొడంబడుట నార్యసమ్మతమగునా? నాదివ్యదృష్టి ప్రభావమున, సర్వవృత్తాంతమును గ్రహించితిని. మీరీ ప్రయత్నము మానుడు.

సు :—మునిచంద్రమా! తమదర్శనమున, మేమతిపావనుల మైతిమి కావున మాముద్వురివి, మోక్షమార్గము నొసంగు సదుపాయము లంభింపజేయుము.

పుష్ప :—ఆర్యా! ఈనిర్భాగ్యులను రక్షించి, మోక్షమార్గమునకనుపుడు.

దుర్గా :—మునితిలకమా! భాగ్యవశమున తిమదర్శనము మాకు లభించెను. ఈసంసారాంధకారముననుండి మమ్ము తరింపజేయుము.

కౌ :—పుత్రులారా! మదీయాశ్రమత్యంత పావనమైన వృక్షరాజములచే నలంకరింపబడి యున్నదికావున, మీముద్వురు నాయాశ్రమమున కరుదెంచి, యందలి దైవభక్తిచే కాలముగడిపిన, కృతార్థులగుదురని తెల్పుచున్నాను. ఈలోకోపవాదములకు బాల్పడుట శ్రేయస్కరముగాదు. సత్వరము నావెంటవిచ్చేసి, భగవద్యానపరులై నాయాశ్రమమునకు వాసిబెట్టుదురని ప్రార్థించుచున్నాను.

సు :—ఆర్యపుంగవా! ధన్యులము తమహితోపదేశమత్యంతయుక్తమై మమ్ముభక్తధారలు గ్రోలజేసెను. కావున తమయభీష్టముల నెరవేర్ప సంతుష్టులమై యున్నారము. ఇకనాలస్యమెందుకు

పుష్ప:—ఆలస్యమేల ఇకనడువుడు.

(అని అందరు నిష్క్రమింతురు.)

## రెండవ రంగము.

(దామోదరుడు, లలిత ప్రవేశించి)

దా:—లలితా! యింక మనకు భయమువలదు. ఏ జననీజనకు ల వియోగాంధకారమున మతి దెలియలేక దైవచింతనకై నరణ్య ప్రాంతములకు బోయిరనివింటిని. మన మిప్పటనే నశించి కాంయాపన మొనర్తుము.

లలి:—ఆర్యా! మహాప్రసాదము.

సీ. భక్తుల నేమారు పలుకరించునదేది
సుజ్ఞానభోజ్యముల్ జూపునేది
యెట్టి వేళలయందు నేమిగాని లెనన్న
నర్పించురాజమై యలరునెద్ది
వారు వీరనకుండ భ్రాంతిగొల్పునదేది
నిత్యజీవనమయ్యు నిలుచునెద్ది
పిలువ ఓహోయనుచు బలుకుచుండిన దేది
యార్య సద్యంశాన నలరునేది

గీ. అట్టి మోహాస్పదంబైన హాయినొంద
మోదమిచ్చెను నా ప్రాణనాథ నీవు
కనికరింపంగ బ్రార్థింతు కమలగర్భ
దివ్యపదమందు వెలయుసం తేజమలర.

అట్టి యగణిత స్వరూపమైన మాధవుని నిత్యపఠన చేయుట మంచిదిగాన, అట్టి పరమపవిత్రమైన పరమాత్మను భజింతము. మనకు సుఖము చేకూరును.

దా:—లలితా! ఎంత వెఱ్ఱివైతివి. తినుటకు భక్తి లేకున్నను మానములకు సంపెంగనూనె యన్నట్లు నిలువస్థలము లేకున్నను

భుజింపభుక్తి లేకున్నను, దైవచింతన మెందులకు ఇవ్వుడు మనజీవనో పాయములఁ యోచింపుము.

లలి :—జీవనోపాయములజూడ, యబలలా ప్రధానము. అంకులకు ప్రధానమైన మీరుండ, నన్నెందులకిట్లు ప్రశ్నించుట.

దా :—ప్రశ్నింపుటెమియు లేదు. నలయు కర్తవ్యమును బోధింతువనియే

లలి :—నాథా! మీకు తెలియని మంచిచెడ్డలు నేనెరుగుదునా? దానివిషయమై నన్నిక బలుకరింపకుడు.

దా :—అటులైన నాయభిష్టమున కంగీకరింతువా?

లలి :—అయ్యది నా సమ్మతమైనచో!

దా :—ఏమి నామనో నిశ్చయములకు నీవు సమ్మతింపనట్లు నిశ్చయమును జూపుచున్నావు, ఇదినీకు ధర్మమగునా!

లలి :—మనోహరా! చాలాపొరపడితిరి. లేనిపోనివి గల్పింప మీకు ధర్మమా?

దా :—లలితా! జీవనోపాయ లభించుదారి లభింపకున్నది. క్షుద్బాధమింట కెగురుచునద్ది.

గీ. జీవనోపాయములగాంచ జెలగుదారి
గాంచనైతిని కాంతరో కాననీవు
నిండు ప్రేమేడి నన్ను మన్నించియాభ
రణములెల్లను ఖవ్వంగ ప్రార్థనంబు

కావున నీయాభరణముల విక్రయించి వచ్చుధనముచే కొంత కాలము సుఖంతము.

లలి :—(స్వగ) అకటా! ఈతుచ్ఛుడిట్టి నీచకార్యమున బ్రవేశించెనా? ఇవ్వనని నెదురాడుదునేని, ముప్పువాటిల్లకపోదు, దీనికి తగునుపాయమును యోచింతమన్న, వీనిబారినుండి తప్పించుకొనుట

క్షమైయున్నది. (ప) మనోహరా ! అజల్లైన నాయాభరణముల ఖర్చుచేయ మీకు మనస్సొప్పెనా ? ఇవియేనా పతులకు సతులపైగల్గు ప్రేమాతిశయములు, ఇదిగో యాభరణములు.

దా :—లలితా ! నీభక్తికెంతయో మెచ్చితిని. (అంతట నామె) సీవిందు నిర్భీతివహించి యుండుము. త్వరలో విక్రయించి వలయు సామగ్రి గొనివత్తును.

(అని నిష్క్రమించును)

లలి :—అకటా ! నాదురదృష్టమెంతని బరిశీలింతును. ఇంతకు నాలిఖితమునకు యెవరేమి చేయుదురు. మీవనుండి వస్తువులను దామోదరున కిచ్చితిని. ఇకను కతడేమి చేయునో తెలియకున్నది. కామోద్రేకమున, జననీజనకులనూపించి, వివాహమునలదని దుర్గారావును పరిహాసించి, తుదకు నేనిట్లు సుఖించుచున్నాను. నారలకేమి లోకువయ్యెను. సర్వజనులు లలితయిట్టి యధర్మమునకు బాల్పడెనంచు దూషించుచున్నారుగదా ! కానిమ్ము, కడచినదానిగూర్చి చింతించిన ప్రయోజనము లేదు. దామోదరుడు ఈసరికి బజారుకు వెళ్ళియుండును. అతడు వచ్చువరకు నేనిందలి విశ్రమించియుందును.

(అని నిష్క్రమించును.)

(తెరపడును.)

---

మూడవరంగము.

దామో :—(ప్రవేశించి) ఆహా ! నాభాగ్యము నా ప్రియమనోహరి యాభరణముల విక్రయించి, యేడువందల రూప్యములు గొంటిని. ఇకమదీయ సౌఖ్యమునకు అంతరాయ ముండునాయని గర్వ మావేశమగుచున్నది. (అని బ్రౌజరులో చేయిపెట్టి) ఆహా !

ఏమి నా భాగ్యము. నాప్రాణసమమైన ఈబ్రాందీ! నాచేతియం దెంత చక్కగా ఇమిడెను ధన్యుడను! (అని సీసాను చేతపుచ్చుకొని) అట్టి హానియము౦దు నేనాచరించిన ఘనకార్యముల స్మరింప నాశ్చర్యమగు చున్నది. మితిమీరి పేలుదునేని, దానిపరిపాలకులెరింగిన, నన్ను వెంటనే అరెస్టుచేయకమానరు. అదంతయు యటుంటనిమ్ము ఇప్పుడు నేనాచరించు క్రూరకార్యములకై పరితపింపవలయును.

ఆ! పరితపించుటెందులకు? నాజీవితమే కీర్తిమయమై వెలుగుచుండ ఇప్పుడు నేనొర్పబోవు కార్యములకు యశముగల్గునా? అదియు కల్ల, (అని బ్రాందిని సేవించి) ఔరా! ఏమిదీని మహాత్మ్యము. సేవించినంతనే మహాశౌర్యము చేకూర్చును. ఈపట్టణమందు సకలసౌందర్య ధనాఢ్యు రాలయిన రాజలక్ష్మియను వేశ్యాకాంతగలదట. దీనిచారిత్రమెల్ల నాల కింప కడుమాయలాడుగా వింటిని. అట్టికాంత గృహమున ప్రవేశించి ప్రేమించి వంచనార్థమున, దానిధనము నపహరింతును నేవలచిన ప్రయత్నములెల్ల కొనసాగియుండ రేడీ మనోవాంఛ నిష్ఫలమగునా?

గీ. తీపుమాటల వెదజల్లి దినదినంబు
ప్రేమ మత్యంత తేజానా బరగునట్లు
వంచనంబు లొనర్చ యీ వారకాంత
మూలధనము లపహరింతు జాలిగల్గ

ఇట్టి ప్రయత్నమూలమున నాలసించిన సుఖము చేకూర కుండును. సత్వరమే ఈకాంత గృహమున కరిగి నాయదృష్ట మును బరిశీలింతును. లలిత యన్ననో యందలియే పరుండియుండును. దానివిషయమై నాకీతరుణమున చింతయేల?

(అని నిష్క్రమించును)

---

దా :—ఆహా! భవనము కడు యందముగానున్నది. ఎంత గాంచినను తనివితీరక యీమందిరమున నాహృదయమెల్ల మిళితమై యున్నది కాని, అందాల కుప్పయగు రాజలక్ష్మి గానరాకున్నది. కారణమేమైయుండును.

(లక్ష్మినిచూచి) అదియేనా రాజలక్ష్మి, దాసిముఖపద్మమును వీక్షింప నట్టికళ లేనందుకు సంకోచమగు చున్నది.

లక్ష్మి :—(సమీపించి) ఆర్యా! రమ్ము కూర్చొనుము తమ పేరెయ్యది)

దా :—నన్ను దామోదరుడందురు. ఇప్పుడు రాజలక్ష్మి యెచ్చటనున్నది, ఆమెతో కొంచెము పనికల్గి వచ్చితిని.

లక్ష్మి :—అయ్యా! ఆమె ఇప్పుడే పరుండినది. ఏమైనను నేనుబోయి తమవృత్తాంతము దెల్పి పిల్చుకొని వచ్చెదను.

(అని లోనికి పోవును.)

రాజ :—(ప్రవేశించి) ఆర్యా! వందనములు. (లక్ష్మివైపు జూచి) లక్ష్మి! తట్టయందు ఫలహారముల గొని తెమ్ము.

దా :—కాంతా! నీడ్యాన్సు కడునందముగా నుంటుందని విన్నాను. ఏదీచూతము కొంతసేపు.

(పావడములు చేకొని రాజలక్ష్మి డ్యాన్సు చేయును.)

దా :—సెహభాష్! రాజలక్ష్మి (అని తల క్రిందికదించును.)

రాజ :—ప్రియా! మొదులకు సిగ్గుజెందుచున్నావు. బ్రాంది చేకొనుము (అని సమీపించి కూర్చొనును.)

దా :—కాంతా!

గీ. మృధుమధుర వాక్యరసముల జరగెనేని
ప్రేమ సద్భావంబులు వెలెసెనబల

నీకు స్వరూపమును గాంచ నిండెసుఖము
నరయభాగ్యంబు నిరుపేదవాని కబ్బినట్లు

నీవయోవిలాస సౌరభ్యముల కెంతయో ప్రేమించితిని. నీకు వలయు ధన మపేక్షింపుము.

రాజ :—ప్రియా! దానివిషయమై నన్ను ప్రశ్నింపనేటికి? తమ యిష్టానుకూలముగ నేయసిని గనికరింపుము.

దా :—మనోహారీ! ప్రేమాతిశయము లుల్లసిల్లు నీ వాక్సుధా రసమున, నాకెంతయో సంతోషమయ్యెను. ఇవిగో నాచెంతనుండు యాభువందల రూప్యములు గైకొనుము.

(అని యిచ్చివేయును.)

రాజ :—మహాప్రసాదము. ఆర్యా! రమ్ము శయ్యాగృహమున కరుగుదము.

దా :—ఇప్పుడువలదు. నేను గృహమునకరుగ నున్నాను. త్వరగా పోవలయును.

రాజ :—ప్రియా! మీరిట్లు పలుకుట ధర్మమా? మక్కువచే మిమ్ము ప్రేమపూర్వకముగా పిలువ... (అని మీదవ్రాలును)

దా :—లలనా! సంతోషమయ్యెను. లోనికిపోవుదము.

అని నిష్క్రమింతురు.)



# రాత్రి

## పంచమాంకము.

### ప్రథమరంగము.

(లలిత—ఒక యింటి యందు)

లలి—:—(నిదనుండి లేచి) అక్కటా యింత పొద్దుయినను, దామోదరుడు రాకున్నాడు, జీకటి నలుదిక్కులందు నతిగాఢముగా గ్రమ్మెను.

గీ. పశ్చిమాంబుధి గ్రుంకె భానుడిప్పుడు
మునిగె దిశలెల్లగాఢాంధమునను చూడ
పక్షులల్లదే గూడుల బఱగసాగె
నాధుడింకను నామోదమలర రాడాయె.

కారణమీషణ్మాత్రమైన గ్రహింతమన్న దెలియకున్నది. బజారుకు వెళ్లి, వస్తువుః విక్రయించినత్తునని జెప్పిన, దామోదరు డింకను రాకున్నాడు. ఇతనిచె నాకేదియో ముప్పువాటిల్లునని, స్పష్టమగు చున్నది. అయినను నావిధివశము నన్నిట్లీడ్చుచుండ నేనేమి జేయగలను.

దా:—(ప్రవేశించి)

గీ. చెలగినారము సుఖమందు కలత లేక
యెన్ని తప్పు లొప్పులుగల్గ మిన్న నంబు
జేసియుండెడి నాప్రియ చెలియ నేడు
ప్రేమమీర ప్రణామంబు జేయువాడ

లలి :—ఏమి? నీ విట్లు వైపరీత్యముల బల్కుచున్నావు. అట్లాన ర్చుటకు గారణ మేమి?

దా :—కారణమా? చెప్ప సిగ్గగుచున్నది.

లలి :—(స్వగ) అయ్యో! ఈతని ముఖమునుగాంచ వస్తువుల విక్రయించి ధనమెల్లను గంగా ప్రవేశమైన ట్లున్నది. ఇప్పుడు వలయు కర్తవ్య మేమి? (ప్ర) మనోహరా మనోసందియముల విన్నవింపుము. సిగ్గుజెందిన ఫలము గలదా!

దా :—కాంతా! బజారున వస్తువు విక్రయించి, నా దురదృష్టమున యాక్రయధనమంతయు గోల్పోయితిని. ఇందులకై క్షమాపణ వేడుచున్నాను.

లలి :—(స్వగ) దైవమా! మనసునదలంచి నట్లాయెను. చెంతనున్న వస్తువుల హరించిన వీడు నాప్రాణంబుల హరింపకుండునా? సర్వదుష్కార్యములకు సమ్మతించియున్నాడు. (ప్ర) ప్రియా! అబలనైన నా యాభరణముల నట్టేటగలిపితివే ఇయ్యది సర్వజనసమ్మతమే!

దా :—సమ్మతము కాదనియే నిన్ను ప్రార్థించుట.

లలి: :—ఆర్యా! గడచినదాని విషయమై నేనోర్పవలసిన దేమియు లేదు. ఇంకనన్ను క్షమించి యీస్నేహవాత్సల్యము మానుకొనుడు. దీనివిషయమై కలహమనవసరము.

దా :—లలితా! ఇదియేనా నీ ప్రేమాతిశయము.

సీ. పెండ్లిమండపమందు పెద్దగాదింప
ముదితరో రక్షింప నిదిఫలంబు
దాల్మిచే నేవేళ దనిన వస్త్రంబుం
నిచ్చి మెప్పించంగ నిదిఫలంబు
కానని యైశ్వర్య మైనను లెక్కింప
నియ్యకొండుట దాని కిదిఫలంబో

యదినిదియనకుండ నార్యులహింసించి
యనలేని యశమివ్వ నిదిఫలంబొ

గీ. నెలత నీసొరు ప్రాణంబు నీదుగుణము
పదిలపరుపంగ దీనికి నిది ఫలంబు
బ్రొంది సారాయములగొని ప్రతిదినంబు
కదసినీసేవ సల్పనా కిదిఫలంబొ.

దుర్మతీ! నాకన్నులమూసి నూతబడద్రోయ యత్నించితివా? ముందు వివాహమంటపమున నీ దుఃఖము మాన్పినందుకు ప్రతిఫలమా

లలి:—పాషాణహృదయా! రిక్తపలుకులచే నిష్ప్రయోజన మగును. నాప్రాణప్రియమైన వస్తువులవిక్రయించి, యా ధనము నపహరించి, యింకను రంకుశాస్త్రముల బోధించుచున్నావా? కలుష పూరితమైన నీహృదయ మంగీకరింప మానవంతుల కది హీనమై యుండును.

దా:—దుర్మతీ! చాలుచాలు. నీప్రసంగములు. అసహాయమైన నీయెడ బాహుబల విక్రమాయుధము ప్రయోగింప పిచ్చుకపై బ్రహ్మాస్త్రమేసినట్లగును. నీకలుష వాక్యములకై క్షమించుచున్నాను.

లలి:—కిరాతకా! ఎందరి సంసారములకు చిచ్చుదగిల్చి, యింతటి సాహసమునకు ప్రయత్నించితివి. అసహాయమైన నాబ్రతుకిక వ్యర్థమగు నట్లొనర్చితివా? ముందుసుఖమున కావంతయైన నలభింపదనితలంపుము.

గీ. ఆదరింపక తనసహాయమై నన్ను
వస్తువుల విక్రయించి నా భాగ్యరాసి
నూతిద్రోచిన నీదగు నూతి మీద
మెల్ల కాల్పనే సుఖమందు నోసగగలదె.

దా :—కలుషమతీ! పిల్లి శాపములు కుక్కలకిందపడునా? నీవు నన్ను దూషించినంతనే నాసంతోషములు దూరమగునా? సర్వబంధు మిత్రగణములందు నపకీర్తి జెందిన నీవు కలియుగసుఖము ననుభవింప గలవా? నాకేమి? పురుషున కింపైన నట్టి సుఖము లభింపక మానదు. రంభనుమించు వనితా శిరోమణులు మదీయ సౌఖ్యధారలై యుండ నీపై నాకిక వాంఛకలదా? నీయిష్టమట్లు మన ప్రేమాతిశౌఖ్యముల రూపుమాపుచున్నావు. ఇవియే కడసారి ముద్దులాలుకు సద్వాక్యము లని నమ్ముము.

(అని నిష్క్రమించును.)

లలి :—(దుఃఖముచే) దుర్మదాంధా! నమ్మిన నన్నిట్లు నవమానింప నిష్క్రమించిన నీకై యమశిక్ష నిరీక్షించుచున్నది. ఇదియే మదీయ వేద వాక్యములు నమ్ముము. నీమనోసుఖములపై నాకెట్టి వాంఛకలదో సర్వప్రాణులకట్లు కల్గియుండునని తెలియదా? ముందు నీలో ప్రేమించిన వస్తువులనర్పించిన లలితయే నీపాలి మృత్యువని తలంపుము. త్వరలో నీకు కాలమాసన్నమైనది.

(మెల్లగ తెర వ్రాలును.)

---

## ద్వితీయ రంగము.

(వేశ్యగృహము.)

రాజ :—(శయ్యనుండి లేచి) మదీయమిత్రుడు దామోదరు డింకను రాకున్నాడు. త్వరలోవత్తునని జెప్పి ఇంత నాలస్యమొనర్చినందు లకు నాచిత్తమత్యంతతత్తరమొందుచున్నది. అతని ముఖపద్మముచూడ గొప్పవంశమున జన్మించినట్లున్నది. కడుఘనికుడని చెప్పుట ననందియము

అట్లు తేకున్న ప్రవేశించినంతనే ఆతడు నారువందల రూప్యములు నా కిచ్చునా? అట్టి సద్దివ్యగుణకాంతిసంపన్ను లెందైన నకలరా?

గీ. అవని కోటానకోట్లుండ యునకులెంతో
ధనము వేడిన నదియు వ్యర్థంబుకలిగె
నేడు నా భాగ్యవశమున నేత్రమలర
ప్రేమమీరగ గడించితి విత్తమెల్ల.

మనోహరు డింకను రాకుండుటచే నా హృదయమంతయు దుఃఖమిళితమై యున్నది. వచ్చునంతవరకు శయ్యపై బరుండెదను

(పరుండును.)

దా:— (ప్రవేశించి) మృదులతకాంతీరాజమైన నా ప్రేయసి శయ్యపై కడుహాయిగ బవ్వళించియున్నది. ఇట్టి గాఢనిద్రియందుండిన యీమెను మేలుకొల్పుట ధర్మముకాదు.

గీ. ఇట్టి సౌభాగ్యసౌజన్య మింతినందు
ప్రేమగొల్పదె నా ప్రాణవిత్తమైన
ధనమ దేటికి నా కింక తలరుబోడి
చారుపంచాంగ మెల్ల నా సౌఖ్యమైన.

(మెల్లగ శయ్యపై కూర్చుండి) యీ కాంతా శిరోమణిని మేలు కొల్పెదను. (శయ్యపై కూర్చుండి) ప్రేయసీ! ప్రేయసీ! ఇంత గాఢ నిద్ర వహించితివా? (కొట్టి లేపును)

రాజ:—(ప్రక్కకు పొల్లుచు) హా దామోదరా! ఇంతఆలస్య మేల జేసిరి. నీపై కల ప్రేమ నా కత్యంత స్థిరమైనదని తెలియదా? దీనురాలిపై నింతనిర్దయయా?

దా :—(స్వ) పాపము ! నాపై మక్కువచే నీమె కలవరపడు చున్నది. ఇట్టి ప్రేమచేయొప్పు నా సౌభాగ్యము నీ ప్రయత్నముల నిప్పుల మొనర్చునా ? ఇక ధన్యుడను. (ప్ర) రాణీ ! దామోదరుడీ శయ్యపై కూరుచున్నాడు లేచి కనికరింపుము.

రాజ :—(స్వ) ఏమి ? దామోదరు డట్టివాడా ? నా మనోభీష్టముల కాత డంగీకరింపడా ? మీరు మా యిరువురయెడ వైరముగొలుప ప్రయత్నించుచున్నారు. చాలులాలు పొండు (అని పలవరించును)

దా :—ఈ వనితాశిరోమణి మతితెలియక నిదురయందు కలవరపడుచున్నది. తిన్నగా మేలుకొల్పెదను. మనోహారీ ! లెమ్ము. నీ ప్రియుడీశయ్యపై ననే కూర్చొనియున్నాడు.

రాజ :—(లేచి) నాథా ! తమ రాకకై నిరీక్షించిన నా చిత్త మెంత తత్తరమందెను ?

గీ. మదనమోహనమైన మీ వదనభాగ్య
 మబ్బునంచును నలువైపు లరసినేడు
 కోటిరూప్యంబులకట్ట పోగొట్టుకొన్న
 విధము గుందితి నా ప్రాణ విత్తరాశి.

అట్లు వగచి వగచి కామోద్రేకమును భరింపజాలక ఇప్పుడీ శయ్యపై బవ్వళించితిని.

సీ. మోహనంబైన మీ ముద్దుమోమునుగాంచే
 సంప్రీతులలరెడి సౌఖ్యమలర.

సౌభాగ్యశాలమీ సన్నిధానముగాంచ
ప్రేమకలలు పెచ్చుపెరిగె నిపుడు
పరమపావనమైన పవిత్రముఖము
నరయ శరీరము నాట్యంబుసల్పె
కల్యాణరూపమీ కాంతిగాంచిన యంత
మందిరంచెంత నెంతో యందమలరె

గీ. నావయో విలాసంబులు నా ధనంబు
జాలిగొందెను మీ కాంతి సస్యములకు
వర్షధారలై యీధర వరలునట్లు
ప్రేమ హెచ్చించె నా భాగ్యధామమునకు.

మనోహరా! మీ సుందర ముఖారవిందమునుగాంచ నాకొక్క కోరిక కలిగినది. అయ్యది సర్వదా నా జీవనసర్వాంతరము సుఖానందమై యుండును. అట్టి నా యీ మనోవాంఛ సాఫల్యమునకై మిమ్ము వేడు చున్నాను.

దా :—అబలా! ప్రియురాలవగుని నీ కోర్కె కాటంకపర తునా? సత్వరము నీ వాంఛ లెరుంగ జేయుము.

రాజ :—హృదయేశ్వరా! గాజవీధియందు నే నొక భవనము నిర్మింపదలచితిని? దానికై రెండువేల రూప్యము లత్యంతవసరమై యున్నవిగాన నీప్రియాంగనపై దయవహించి యట్టికోర్కె నెరవేర్పుము

దా :—(స్వ) ఓహో! పురవాసులు చెప్పినట్లీ లతాంగి కడు మాయలాడిగానున్నది అందులకే యీమె మిక్కిలి ధనము గడించిన దట. (ప్ర) రాజ్యలక్ష్మి నిన్న సాయంసమయమున నేనొక దా యాగునవం దలరూప్యముల నీ కిచ్చితిని. ఇంతలో నంతధన మపేక్షించిన నాకివ్వ సామర్థ్యమున్నదా? ఇంచుకైన కరుణ లేదా?

రాజ :—కరుణ లేకపోవు టెందులకు? మీకు మిక్కిలి నాపై ప్రేమగాంచిన నీవు నా యభీష్ట మీడేర్పలేవా? ఇదియేనా నీ ప్రేమ?

దా :—కలికి!

గీ. తెలియవయితివి నాదు సద్దివ్యమైన
ప్రేమపాశము నీపైన కరుగుచెల్ల
ప్రాణసాక్షిగ బల్కెనే పలుకులిపుడు.
లేను నా చెంత ధనమింక లేదు లేదు.

త్రికరణశుద్ధిగా జెప్పు నా యీ పలుకుల నమ్ముము.

రాజ :— (స్వ) ఓహో! ఇతడు సరసాగ్రేసర చక్రవర్తియై యున్నట్లున్నది. ఇట్టి వ్యర్థప్రలాపితో సఖ్యమొనర్చిన ధనమిక చేకూరునా? (ప) ఆర్యా! ఇట్టి నా యీ కోర్కె నెరవేర్పలేని నీకు ప్రేమ మెందులకు? వేశ్య సద్గుణాతిశయంబు లెరుంగరా?

దా :—ఓహో! నన్ను మోసగింప ప్రయత్నించుచున్నావా?

సీ. తల్లిదండ్రుల యిష్ట మెల్లనంచును నేను
తల్లిని శోకాన దనిపినాను
విద్యపై నిష్టమే కలగలేకుండుటచే
ఓ మేడు చదువక విడచినాను
ప్రేమాంకురంబున విత్తనంబుపోనాడి
అతులిత కష్టంబు లందినాను
హీనజాతిగుణంబు ఏ నెరుంగక నేను
నీ యింటిలో నేను నిలచినాను

గీ. యింత్రుమిగాగ బ్రొంది నా కిచ్చి నీవు
విత్తమెల్లను హరియించి వేశ్యరీతి
జెప్పుచున్నావు చాలింక స్నేహమిపుడు
మాట మాటాడ తన్నెద జంకకింక.

రాజ :—ప్రియా! నన్ను దన్నెదవా? ఎన్నడు లేని మరభ్యాస

మున కల్పించితిననియా ? నన్నుకనికరింపుము. నేజేసిన యపరాధము నకై క్షమింపుము. మీ ప్రేయసిని చేబట్టుము.

దా :—అబ్బా ! నీవు ప్రేయసివి ! ప్రేయసి ! సద్గుణాతిశయములు అందరికి విశదమేకదా ! నేనిందు చెప్పవలసిన దేమున్నది.

గీ. దోసకూపంబునంబడి క్రూరులగుచు
వేరువిధములు లేక యీవృత్తి పడుపు
వృత్తి జేయుచున్నారు. యీ వేశ్యజాతి
ఎట్టికలుషంబు గలదు నే నెరుగనొక్కొ—

వేశ్యలు ప్రియులపాలిటి మృత్యువులని నాకు తెలియును, ఇంక నీయధిక పరిసంగముల జాలింపుము.

రాజ :—ప్రియా ! నన్నింత యవమానించితివా ? దుర్మార్గురాలనైన నా యింట మీ రేల ప్రవేశించితిరి?

దా :—స్వయముగా నేను ప్రవేశింపలేదు. లిఖితము నిట్లు ప్రవేశించితిని.

రాజ :—అటులైన నీవిధిని దూషింపుము. నన్నేల దూషించెదవు ?

దా :—దానికంటె దుర్మార్గురాల నైనందుకు—

రాజ :—(ఆర్ద్రోక్తిలో) దుర్మార్గురాలనా ? ఎందుకు ?

దా :—బాలింది నిర్బంధముగా నాకిచ్చి మత్తెక్కియున్న వేళ నా చెంతనున్న యారువందల రూప్యములు హరింపలేదా !

రాజ :—పాపము ! అన్యకాంతలపొందూరక లభించునని దలంచితివా ? చాలు చాలు ఏమో నీతిపరుడవంచు నమ్మినందులకు దూషించుట ప్రతిఫలమా?

దా :—దుర్మతీ ! దూరమున బొమ్ము. (కాలితో తన్నును.)

రాజ :—ఛీ మూర్ఖుడా! అబలను తన్నుట ఒక ఘనమగు కార్యమే నా! చూడు ఇప్పుడు నిన్నేమి జేయించెదనో మావారితో జెప్పి.

దా :—ఆఁ! మీవాళ్ళతోనే కాదు, బ్రహ్మతో కూడా చెప్పు కొనుము పాపీ! (అని మరల తన్నును.)

రాజ :—బాబోయ్! నన్ను కొట్టి చంపుతున్నాడర్రో రండి, రక్షింపుడు! రక్షింపుడు! (అని కేక లేయును)

దా :—యింకను నీయింటియందు కాలెడుదుననే ఛీ. ఛీ.

(అని బైటికివచ్చును.)

ఔరా! ఏమి ఈ కామాంధకారము! ఎట్టి వీరాగ్రేసరునైన బంధింపగలదు సంహరింపగలదు. ఏదియో నాకు కాలమానన్నమగుటచే ఈ వేశ్యామందిరమున బ్రవేశించితిని. బాగిందిమత్తు చే మతి తెలియక చేతనున్న ద్రవ్యమంతయు రాజలక్ష్మి కిచ్చివేసితిని. ఇంతకు కారణము నాపూర్వజన్మసుకృత ఫలమేకదా! నమ్మినట్టి స్త్రీలను వంచించి నట్టేటముంచినట్టి ఈకలుషహస్తములకు మోక్షము కదా? ఇదంతయు నే ననుభవింపవలసిన కర్మఎట్టి తపోనిష్ఠాగరిష్ఠుడైనను కాలకృత్యమెరుంగునా? తారలునైతి మిట్టి కష్టము లనుభవింపవలసిన దేకదా! కానిమ్ము. చేతమాత్రమొక చిల్లిగవ్వయైన లేదు. ఇక నే నెచ్చటనయిన నుద్యోగమును సంపాదించి జీవనోపాయము చేయవలెను. ఉద్యోగం పురుషలక్షణమనిగాదా! నీతికోవిదులు చెప్పుట. ఔరా! ఏమి ఈ ధనమహాత్యము.

గీ. హరుల గపిఁప ముంజేతియాయుధంబు
కూటసాక్ష్యంబు బొంకించు కూర్మినిజము

ఏమి గావలెనన్న గూర్కించునోర
ధనము లేనట్టి బ్రతుకు వ్యర్థంబు నిజము.

నే నీ కార్యమును బ్రయత్నించితమన్నను డబ్బు ప్రధానమై యున్నది ఏప్రదేశమును గాంచినను 'నో లక్కీ' అను సద్వాక్యమే కాని నాకు సదుపాయము లభింపకున్నది. దేవుడా! గుణస్తోమా యీ దుర్మార్గుని దామోదరుని గాపాడవా?

గీ. ఆర్తజనపోష నన్నేల నార్తిమించి
ఒరులకై వడి జూతువో పరమపురుష
తినగతిండియు లేక నీ దినమదెల్ల
నార్తినొందితే నేభుక్తి యబ్బదాయె.

నా యీ క్షుద్బాధను సహింపలేకున్నాను. వలయుసదుపాయ ముకొంతమన్న నా కేమియు స్ఫురింపకున్నది (అని జేబును చూచి) ఇది యేమీ నా చెంత ఫౌంటెన్ పెన్ యున్నది. దీని నెంతైన విక్రయించియో, లేక తాకట్టుబెట్టియో వచ్చుపయికముచే క్షుద్బాధను మాన్పుకొనియెదను తుదకు సర్వేశ్వరుడు నన్నిట్టి అధమగతికి పాల్జేసెనా! కానిమ్ము (పోవును).

(తెర పడును.)

---

## తృతీయరంగము.

(వర్తక గృహము—సేరిశెట్టి కూర్చొనియుండును.)

దా:—(ప్రవేశించును) అయ్యా! నమస్కారము.

సేరి:—బాబూ! నమస్కారాలొద్దు ఎవరొచ్చినా యిలాగే డబ్బులాగుతారు ఎందరికని సమాధానం చెప్పాలి?

దా:—అయ్యా! నేను భిక్షుకుడనుగాను నీతో పనిబడి వచ్చితిని

పేరి :—ఏమి పని ? మీరు దేయూరు ?

దా :—నా స్థలము నెల్లూరు బిద్యే చదివి ఉద్యోగము లేక కష్టపడుచున్నాను. మూడుదినములనుండి అన్నమే లేదు.

పేరి :—బిద్యే చదవటం అన్నం లేక పోవటం చాలేవయ్యా యీలాంటివారు చాలా మూచాము. ఏదైనా కనికరం పుట్టి సహాయం చేస్తాడని నీ అభిప్రాయం.

అయ్యా ! అట్లుకాదు. మీరేమీ నాకొసంగ వలదు. ఇదిగో ! నా చెంత యీ వస్తువున్నది. దీనిని కుదువయుంచుకొని మూడురూ ప్యములిమ్ము.

పేరి :—డంబాలేమో చాలా చెప్తారు. ఫౌన్టెన్ పెన్ కుదువ బెట్టుతానంటావు నీవేమో చాలా మోనగాడివిలాగున్నావు. దాని నెచ్చటనైన దొంగిలించితివేమో ?

దా :—అయ్యా ! నా మాట నమ్మడు యిది నాది, నే నెవ్వరిది దొంగిలించలేదు. నేను దొంగనుకాదు,

పేరి :—దొంగ దొంగయని చెప్పుకొనునా ? చాలు చాలు పోవయ్యా ! నాకూ నీకు పోలీసుతంటావద్దు.

దా :—అయ్యా ! నీ కాళ్ళంటి మ్రొక్కెద నన్ను కనికరింపుము.

పేరి :—అ యధిక ప్రసంగాలమాని యావలబొమ్ము. లేదేని నినిచ్చటనుండి గెంటించెదను. సేవకా ! వీనిమెడబట్టి బైట ద్రోయుము ఈలాటి సన్యాసులెవరొచ్చినా సంసారములు పాడు చేస్తారు. (సేవకుడు దామోదరుని మెడబట్టి బైటకు ద్రోయును).

దా :—ఆహా ! ఇక నా యీ జన్మమెందులకు ? (పెన్నును నేలకొట్టి) ఎట్టి నీచవాక్యము లాలింపవచ్చె ? ఈ జన్మమున్న నేమీ ? అంతరించిన నేమి ?

గీ. ప్రాణతుల్యంబులనుగాంచి భ్రాంతిగొంచు
జీవనోపాయధారణ : జెందదలచి
యన్యసుఖముల బోవ్రోచి హానిగూర్చి
ప్రబలనేటికి యదియొక్క ప్రాణమగునే.

సకలనీతిశాస్త్రమును అభ్యసించియు నిట్టి నీచపుపనిలో ప్రవే
శింపవలసివచ్చె. క్రూరుడు వైశ్యుడిట్టి కలుషవాక్యములచే నిందిం
చెను ? ఎంతమరతుమన్నను యివి సూదిములుకులట్లు నా హృదయ
మున గ్రుచ్చుకొనుచున్నవి కానిమ్ము ఇప్పుడు నేప్రయత్నించినది
ధనమునకేకదా ! అట్టి ధనము నేనెట్టి యిడుమల బెట్టబడినను నా చెంత
జేర భయమొందుచున్నది ఇప్పుడు నాకొక సహాయము లభించి
నది అందు లభించుధనము అత్యంతసుఖానందకారులై నా తేజాభివృద్ధి
వృద్ధిజెందునని తెలుపుచున్నది. ఏది యెట్లైనను ఈ రాత్రి వైశ్యునింట
దొంగతనమున ప్రవేశించి సాధ్యమైనంత ధనము గ్రహించెదను.

(తెర పడును.)

---

## చతుర్థరంగము.

(కోమటి గృహము. అందరు పరుండియుందురు.)

దా :—(మెల్లగ ప్రవేశించును) హా దామోదరా ! ఎట్టిసద్వం
శమునజన్మించి యిట్టి నీచకార్యమైన దొంగతనమున కంగీకరించితివి ?
అయినను కానిమ్ము. సుమారిప్పుడు రాత్రి పండెండుగంటలయ్యెను.
వీరినిజూడ గాఢనిద్రయందున్నట్లున్నది. ఈ గృహము కడుధనాభరణ
ములచే నలంకరింపబడియున్నది. నలువైపులు నా హృదయం నాకర్షిం
చిన ఎట్టిప్రయత్నమును చేయసీయకున్నది. ఇప్పుడు నేనతిజాగరూకు
డనై యిప్పుడు ప్రవర్తింపవలెను. లేకున్న నా ప్రాణములింక దక్కవు.

అదిగో! ఆ వైపున నిసుపపెట్టెయున్నది. అందుకల ధనమును హరిం
చునేని కడుధన్యుడనగుదును. (అని మెల్లగా పెట్టెచెంతకరిగి) ఇత్యాది
భద్రముగా తాళమువైచియున్నది. నా చెంతకల పరికరములచే దీనిని
చప్పుడులేకుండ తీయుదు (అని తాళముతీసి పెట్టెను తెరచి నలుదిక్కుల
జూచి) ధన్యుడను. (అని వస్తువులను ధనము తీసుకొని) ఇంక నేవచ్చిన
దారిబోయెదను. సర్వేశ్వరుని కరుణాకటాక్షవీక్షణముచే నా మనో
వాంఛ పరిపక్వమొందెను. (అని ముందునకు నడచును)

సేవ :—(కన్నులు నులుముకొనుచు లేచి) ఎవడో దొంగప్రవే
శించి ఇంట వస్తువులనెల్లను దోచుకొని పోవుచున్నాడు అతని ముఖ
మును గాంచ సాయంసమయమున మా వర్తకగృహమున కరుదెంచి
అవమానింపబడిన యువకుడట్లున్నది. ఇక నే నాలసింతునేని ఈ దోపిడి
నా కంఠమున కెరిత్రాడై రాకమానదు. (అని ధనికుని లేపి) అయ్యా!
మనయింట దోపిడి జరిగినది అదుగో దొంగ ప్రక్కన దాగుచున్నాడు

పేరి :—సేవకా! ధనము నష్టేటకలిసినదా? అదుగో ప్రక్కను
గల గోడకు దొంగ కన్నము వేసినాడు. నీవందు నిలచి భద్రముగా
జూచుచుండుము.

సేవ :—మంచిది. (అని బిలమువద్దకు వెళ్ళును)

పేరి :—(భార్యను లేపి) నెమ్మదిగా లెగు. దొంగదోచుకున్నాడు

భార్య :—నాధా! ధనమంతయు పోయినట్లున్నదే రమ్ము దొంగను
పట్టుకొందము. (అని పోయి దామోదరునిపట్టి) సేవకా! త్వరగా రమ్ము
వీనిని బంధింపుము.

దా :—ఔరా! తుచ్ఛులైన వీరిచే తుదకు ప్రాణముపోవలసి
వచ్చెనే ఇంక నిరీక్షింపరాదు. ఇతడేగదా ధనికుడు నన్నవమానించిన
తుచ్ఛుడు. (అని పిస్తోలుతో ధనకుని పేల్చగా గొప్పశబ్దమగును.)

పోలీ :—(ప్రవేశించి) ఎచ్చట ? పిస్తోలుశబ్దము ? అని (వారల జూచి) ఎవరు ? ధనికుని కాల్చినది ? ప్రాణములున్నవా ?

సేవ :—అయ్యా ! (దామోదరుని వైపుజూపి) ఇతడే పిస్తోలు తీసుకొని పేరిశెట్టిగార్ని కాల్చినాడు.

దా :—అయ్యో ! కాల్చినది నేనుకాను సేవకుడే దానికి కారణము......

భార్య :—(ఆర్తో క్తిలో) ఔరా ! దురాత్మా ! నా పెనిమిటి ప్రాణములుతీసి తుదకు ఇంటిసేవకునిపై హత్యమోపుచున్నావా ?

పోలీ :—అమ్మా ! రండి వీరిని తీసుకొని మనమందరము న్యాయస్థానమునకు వెళ్లుదము. అక్కడ వీరికితగినశిక్ష విధింపజేసెదను

అందరు వెడలిపోవుదురు.)

తెర వ్రాలును)

---

## పంచమరంగము.

లలి :—(ప్రవేశించి) ధన్యురాలను నేడు దామోదరుడు నా చేతి కీలుబొమ్మ చందమాయెను. అతని రహస్యములెల్లను, నాకు తెలసినవే నిన్నరాత్రి పేరిశెట్టిగారి ఇంట దామోదరుడు దొంగతనము నకై ప్రవేశించి పో వీలుండక వారలు పట్టుకొనబోవుచుండ వారిని పిస్తోలుతో కాల్చినాడట. అందుపేరిశెట్టి పాపము ! గతించినాడట. అంతట పోలీసులు పట్టుకొనగా హత్యపేరిశెట్టిగారి సేవకునిపై మోపి నట నన్ను వివాహమండపముందుండి దొంగిలించి నాయాభరణము లమ్ముకొని తుదకు నన్నడబాసినట్టి తుచ్ఛుని దామోదరుని శిక్షింపక మానుదునా ? నేటికి నాకుగలశిక్ష ప్రశాంతమొందెను. ఇక నాలశిం పక న్యాయస్థలమునకు వెళ్లి దామోదరుడే హత్యకు కారణమని సాక్ష్యమిత్తును. అప్పుడు లలితప్రభావముల దామోదరుడెరుంగ కుండునా ? (అని నిష్క్రమించును.) (తెర పడును.)



# రౌడీ

## షష్టమాంకము.

### ప్రథమరంగము.

న్యాయస్థలము న్యాయాధిపతి, ప్లీడరు మున్నగువారు కూర్చొనియుందురు.)

న్యాయా :—ముద్దాయి దామోదరు డెచ్చట నున్నాడు. వానిని పిలువుడు.

సేవ :—(దామోదరుని మూడుసార్లు పిలచును.)

న్యాయా :—పోలీసులు కానిస్టేబులు నెం 304 ను పిలువుడు.

(సేవకుడు పోలీసును పిలచును. పోలీసు బోనులో ప్రవేశించును, దామోదరుడు, పేరిశెట్టిభార్య సేవకుడు బోనులో ప్రవేశింతురు)

సేవ :—(పోలీసుతో) దేవునియెదుట ప్రమాణముచేసి నిజము చెప్పుము.

పోలీ :—అయ్యా! మొదటిదినము రాత్రిపండ్రెండుగంటలకు నేను మార్కెట్టు బజారున బీటు యందు నుంచుంటిని.

ప్లీడ :—పేరిశెట్టిగారి గృహము నీవెరుంగుదువా? అది ఎచ్చట నున్నది?

పోలీ :—వారి గృహము నేనెరుంగుదును. మార్కెట్టు బజారుననే కలదు.

ప్లీడ:—ఆరాత్రి సుమారు పం|డెండుగంటలకు పేరిశెట్టిగారిగృహామందు ఏమి జరిగినది?

పోలీ—బీటుయందుండగా సుమారు ఒంటిగంటకు నేనొకశబ్దమును విని అదిపిస్తోలు దెబ్బగాభావించి శబ్దమునుపట్టి పేరిశెట్టిగారి ఇంటిత్రోవను పరుగెత్తితిని వారి ఇంటిలోగల భయంకరరోదాతములైన పలుకులాలకించి వారి గృహముల ప్రవేశించితిని.

ప్లీడరు—ఆవల మరేమి జరిగినది?

పోలీ—అందు పేరిశెట్టి భార్యఅతని సేవకుడు ఈ ముద్దాయిని పట్టుకొని యుండిరి. అక్కడనే పేరిశెట్టి రొమ్మునవాటి పిస్తోలుదెబ్బ పడియుండెను.

ప్లీడ—దేనికై వారు ముద్దాయిని పట్టుకొనియుండిరి? నీకేమైనా తెలియునా?

పోలీ—ఈ ముద్దాయి వారిఇంటిలోనికి దోపిడికైవచ్చినందున వారు పట్టుకొనియుండిరి. ప్రక్కను జూడ గోడకు కన్నము వేసియుండెను.

ప్లీడ—అప్పుడీ ముద్దాయిచెంత పిస్టలు, ఆభరణము లేమయినాయుండెనా?

పోలీ—(పిలుగల మూటవిప్పి) ఇదిగో! ఈ పిస్టలు, ఈ ఆభరణములు వారిమధ్యలో పడియుండెను ఎవరిచెంతను లేవు.

ప్లీడ—అప్పుడేమైనా దానివిషయమై విచారించితివా?

పోలీ—ఈ ముద్దాయిని విచారింపగా హత్యకు కారణము సేవకుడని చెప్పెను. అంతలో తమ సన్నిధానమునకు ఈముగ్గురిని కొని తెచ్చితిని.

న్యాయ—ఇకను ముద్దాయిని విచారింపుము.

ప్లీడ :—(ముద్దాయినిచూచి) పోలీసు 304 చెప్పిన సాక్ష్యము నకు ఒప్పుకొలదేనా ?

ముద్దా :— నాకు ఒప్పుదలకాదు. హత్యకుకారణము సేవకుడే కాని నేను కాదు.

ప్లీడ :— అయిన నీ వా ప్రదేశమునకు రాత్రివేళ పోవుటకు కారణమేమి ?

ముద్దా :— వారియింట భయంకరోత్పాతముల గల్గియుండుటచే చూడ ప్రవేశించితిని.

ప్లీడ :— నీ వా సమయమున ఎచ్చటనుండి వచ్చుచుంటివి ?

ముద్దా :— రామమోహన సినిమా ఫష్టుష్లే అయిన పిమ్మట అదేదారిని వచ్చుచుంటిని. నిష్కారణముగా నాపైనింద మోపినారు.

సేవ :— అయ్యా ! ఇతడు మా శెట్టిగారింట దొంగతనమునకు ప్రవేశించి యాభరణముల దొంగిలించి పోవుచుండగా పేరిశెట్టి యాతని భార్యా, నేనూ కలసి ముద్దాయిని పట్టుకొంటిమి. బలత్కారముగ నొకహస్తము విడపించుకొని పిస్తోలుతో పేరిశెట్టిగార్ని కాల్చినాడు. అంతలో పోలీసు ప్రవేశించి న్యాయస్థలమునకు గొనివచ్చెను.

పేరిశెట్టిభార్య :— మా సేవకుడు చెప్పినదంతయు సత్యమే దానికి నే నంగీకరించితిని.

న్యాయ :— పోలీసు స్టేటుమెంటును జూడ అతను న్యాయముగా చూడనట్లున్నది. ముద్దాయివైపుగాని పేరిశెట్టివైపుగాని బలమైన సాక్ష్యము లేకున్నది.

ప్లీడ :— ఈసాక్షి పేరిశెట్టిగారి సేవకుడైనందునను ఈమె భార్యయైనందునను సాక్ష్యము నమ్మతగినదికాదు.

లలి :—(ప్రవేశించి) అయ్యలారా ! నా సాక్ష్యము నమ్మదగినది కాదా ? దామోదరుడు సత్పురుషుడని తలంచితిరా ?

ప్లీడ :—అమ్మా ! నీ వెవరు ? నీ యూరేది ?

లలి :—అయ్యా ! నేను లలితయనుదానను నా స్థలము బళ్లారి.

ప్లీడ :—అయిన నీ ప్రదేశమున కేలవచ్చితివి ?

లలి :— నా వివాహసమయమున ఈ దామోదరు డచ్చట ప్రవేశించి పిస్తోలు తీసుకొని నా జననీజనకుల బెదరించి నన్ను నిర్బంధించి మోటారుకారునం దీప్రదేశమునకు గొనితెచ్చెను. అవల నా చెంతనున్న బంగారునగలెల్ల తీసుకొని విక్రయించుకొని ద్రవ్యమిచ్చుటనో పోయినదని చెప్పెను. అంతట నేను పలువిధముల ప్రశ్నింపగా నన్ను కాలితో తన్ని నంబంధ మేమియు లేదని వెడలిపోయెను.

ప్లీడ :—ఇతని పూర్వవృత్తాంత మేమైన తెలియునా ?

లలి :— ఇతడు బొంబాయి కాలేజీ విద్యార్థియుట. ఇతడు కడు మొండిగా తిరుగుచు మోహనసింగు భార్యను ప్రేమించి ఆమెను వశపరుచుకొని మోహనసింగును జంపినాడట. ఇతని చారిత్ర మెల్ల కడు చిత్రమైయున్నది.

న్యాయ :—ఇప్పుడు సాక్ష్యమునుబట్టి ముద్దాయికి శిక్ష విధింపవలసియున్నది. తదితర మూడుసాక్ష్యములుకూడ నిజమైయుండును.

ప్లీడ :—శిక్ష విధించుటయందు సందియము లేదు. కడుకఠినముగానే విధింపవలెను. దామోదరా ! లలితసాక్ష్యము నీకు సమ్మతమేనా?

దా :—(పలుకక నిలిచియుండును.)

న్యాయ :— ముద్దాయికి మరణశిక్ష విధించినాడను. రెండు ప్రాణములు హరించెననుటకు సందియము లేదు.

ప్లీడ :—విధింపవలసినదే.

న్యాయ :—(పేరిశెట్టి భార్యతో) అమ్మా! నీ యాభరణముల గానిపొమ్ము. గతించిన పెనిమిటికై చింతింపవలదు. లలితా! నీ సాక్ష్యమునుపట్టి దామోదరునికి మరణశిక్ష విధించినాడను. పాపమంతయు దైవము నిరీక్షింపవలసినదే.

లలి :—అయ్యా! నా సాక్ష్యమునందేమి కాసంతైనా అసత్యము లేదు. ఇక సెలవు తీసుకొనెదను.

ప్లీడ :—న్యాయాధిపతిగారూ! ఇక పోవుదమురండి.

(అందరు నిష్క్రమింతురు.)

---

రెండవరంగము.

(రాజభటులు దామోదరుడు ప్రవేశింతురు)

దా :—అయ్యలారా! దైవప్రార్థనకై కొంచెము సెలవొసగుడు.

రాజభటులు :—మంచిది.

దా :—భారతదేశీయ సోదరులారా! నాయీ కలుషచేష్టలకై నన్ను దూషింపకుడు.

సీ. కడుపున నవమాసకాలంబుమోసిన
ప్రేమ తల్లి దుఃఖపెట్టినాను
కోటానకోటులు గూడియుండిన వాడు
విత్తంబు బవలు ఖర్చుబెట్టినాను
స్నేహింతబన్న యీ చెనటుల శిక్షించి
ద్రవ్యంబు చేకొంచు దనరినాను
ప్రేమతో నమ్మిన విమలాక్షులనుబట్టి
తొలుత నే నగలెల్ల దోచినాను

గీ. ఎందరో దయాపరులు నా హీనమైన
కలుషహస్తమున నే మృతి గాంచినారు
బ్రతుకుపై భ్రాంతి లేదు నా ప్రాణశిక్ష
తప్పగలదొక్కొ వేయేండ్లు తప మొనర్ప.

ఇందుల నాకు సహాయమొనర్చు వారొక్కరైన లేరు. ముందు నా వినాశకాలమున పరివర్తించిన పరివర్తనలెల్ల కలుషమునకు ప్రధానమై యుండును. అవియే ప్రాణశిక్షమృత్యువులై యున్నవి. సజ్జనస్వభావులారా!

సీ. ఆంగ్లకంబునగల హాస్యంబుగౌరవ
మే విద్యయందలి నొసగబోదు
మాతాపితృలసేవ మది స్మరించెడువారి
కలుషము మోక్షంబు గాంచగలరు
త్రాగుడు మితిమీరి ప్రబలుచుండుటయెల్ల
నార్యోత్తములకవి యార్తినిజము
వేశ్య సాంగత్యంబు విత్తంబు హారణంబు
దోపుడులెల్లను దొడ్డగావు
గీ. చేసినాడను పెక్కుగు చెనటిక్రియల
పోవుచున్నాడ నా జీవములను బాసి
ఆర్య సద్వంశవేత్త దయాపరులార
వందనం బిదిమీకు నే నందజేతు.

(అని నిష్క్రమింతురు.)

[తెర వ్రాలును.]

సంపూర్ణము.

# అనుబంధములు

1 అనుబంధము—దామోదరుడు.

ఆటలన్నిటికి మించి చెలంగిన అందమైన బంతాటా
త్వరగాను నే బోవకపోతే పందెము చెడు నీపూట
బ్యాటుహ్యాటు బూటువేసుకొని త్వరగా నేబోయి
యెటులైనా నాప్రజ్ఞజూపి పందెమునే గెలువవలెన్
యేమిచేయుటకు తోచకున్నది యేమగునో యీవేళా.

2 అనుబంధము—దామోదరుడు.

దయరాదా జనకా నీకు నాపయి
నిను యెంతేని వేడుదు కరుణయురాదు
కృపతో బ్రోతువని నమ్మివచ్చితిని
యింతకష్టపెట్టుట నీకు న్యాయమా
జనకా నాయందు దయవుంది నన్ను రక్షింపుము.

3 అనుబంధము—మూర్తిసింగు.

ప్రియసఖి పువ్వవనమిదె గనుమా
నానావిధముల పుష్పజాతులతో
నలరారెడు యీవనమును గాంచుమా
జాగరూకతతో నడువుము యబలా
పొదలుముండ్లు గలవు యిచట
కనుక నెమ్మదిగా నడువుము బాలా

4 అనుబంధము—యోగి.

నీ మహిమలు నూహింపగ తరమా
నిఖిలేశా యీనరులకు ప్రవిమలా
సకలాశ్రితరక్షా ప్రకటిత మహిమా
సుకకరగుణా జయతు జయతు కృష్ణా॥

5. అనుబంధము—రాజలక్ష్మి-త్రితాల్.

ఓహో ఈవన కుసుమము కేలా
మదిరాగర్వము పొడగజాలా
అందగత్తెనని మురిసెదవా
యెల్లప్పుడు నను కృపతో జూడుము
విడువక నాతో వుండుము నాథా !

6. అనుబంధము—మీనాక్షి-మాండు.

ఆశయెగా యీ మాయా ప్రపంచము
స్వాగతంబున్ మమతల్ వీడుమా
దేహము గేహము జూచి భ్రమసినా
మాయలలో బడిబోవకుమా
సహాయకారరూ రారునీతో
వుపాయమేమో గనుమా మనసా ॥

7. అనుబంధము—దామోదరుడు—కాఫీ

మానుకోగదవే మనసా
మద్యపానపు మాహాత్మ్యమును యిక
సతీపతులా సంపద లెసబాసీ
సర్వనాశమును దొరలదగజేయును
అఖిల వ్యాధులు అధికముకాగా
ఆ నొందగ జేయును మనసా
జ్ఞానులు నా అజ్ఞానులయినా
నీచ వర్తనకు లోనై తిరుగకిటు
ప కీర్తిని పాపహారితులయి
ద లన పాలగుదురు మనసా ॥

సంపూర్ణము.

రాజమహేంద్రవరమున కాళహస్తి తమ్మన్నరావు అండ్ సన్సు వారి స్వకీయ
శ్రీ రాజేశ్వరీ ప్రెస్ నందు, ముద్రించబడినది.—1945.

# అపకుశ

కీ॥ శే॥ కాళహస్తి సూర్యప్రకాశరావుగారి, రచన.

ఆంధ్రదేశములో గవుల సంఖ్య నానాటికి బెరిగిపోవుచున్నది. ప్రకటనకర్త లెక్కువగుచున్నారు. “మందిలావయిన మరమునకుఁ జేట” ను సామెత మీరెఱుంగనిదా! అసమర్థులగువారిచే వ్రాయఁబడిన వ్యర్థగ్రంథములను దక్కువవెలకుఁ గొని, చదువబోయి పుటను దెఱచి, మూసివేయుట పాఠకుల కనుభవైక వేద్యమేగద! అందులకుఁ గారణము?—సరకు లేకపోవుటచేత! మా నాటకమట్టిది కాదు. పద్యములను పది పర్యాయములు వచనమును వందసార్లు పాటలను బాతిక మారులు చదువకయే, గ్రహింపకయే, మిన్నకొనలేరు—అనగా శైలి మనోహరము—రత్నముల మాల—అమృతభాండమునై చుక్కలలోని చంద్రునివలె మానాటక మితర గ్రంథములలో శెల్ల మిన్నయై చెన్ను మీఱుచున్నది. అతిశయోక్తి కాదు. అసత్యము లేదు. చాకలివారి సంభాషణము విన్నంతనే కనుపులు చేతపట్టుకొని నవ్వనివారుగాని, సీతావియోగమునఁ బరితపించు రామునితోఁ బాటు కన్నీరు విడువని వారుగాని పందెమునకయినఁ గనఁబడరు. ఆత్మస్తుతి గాకున్న—సుప్రసిద్ధము! నేఁడే పుస్తకమును దెప్పించుకొని చదివి, ఆనందింపుడు.

చక్కని మూడవకూర్పు వెల **1—0—0**

విక్రయించువారు:—

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,**

ప్రింటర్సు, పబ్లిషర్సు, అండ్ బుక్సెల్లర్సు,

**రాజమండ్రి.**

# కె. తమ్మారావు అండ్ సన్సు వారి స్వంత ప్రచురణములు.

| | | | |
|---|---|---|---|
| పాండవాజ్ఞాతవాసము | 1-4 | కనకతార | 1-4 |
| సంగీత సావిత్రి | 1-4 | సారంగధర | 1-4 |
| జయంతజయపాలము | 1-4 | మీరాబాయి | 1-4 |
| సత్యహరిశ్చంద్ర | 1-4 | లవకుశ | 1-4 |
| సంగీత కాంతామతి | 1-4 | భక్తకుచేల | 1-4 |
| తారవిలాపము | 1-4 | రాధాకృష్ణ | 1-4 |
| రోషనార | 1-4 | అనసూయ | 1-4 |
| పాదుకాపట్టాభిషేకం | 1-4 | రామదాసు | 1-4 |
| లంకాదహనము | 1-4 | బొబ్బిలి | 1-4 |
| ద్రోణప్రతిజ్ఞ | 1-4 | చింతామణి | 1-4 |
| పద్మవ్యూహము | 1-4 | శశిరేఖ | 1-4 |
| శ్రీకృష్ణలీలలు | 1-4 | సతీతులసి | 1-4 |
| శ్రీకృష్ణరాయభారం | 1-4 | ద్రౌపది | 1-4 |
| సంగీత ప్రహ్లాద | 1-4 | ప్రమీల | 1-4 |
| శ్రీకృష్ణతులాభారము | 1-4 | అహల్య | 1-4 |

వలయువారు :—


**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు**

ప్రింటర్సు, పబ్లిషర్సు, అండు బుక్సెల్లర్సు,

**రాజమండ్రి.**